# ఇంకా 14 ఏళ్ళేగదా! అప్పుడే వాచ్ కావాలని అడుగుతున్నావేమిటి అమ్మాయ్!

తలిదండ్రులకు వారి ముద్దులబిడ్డ బాల్యంలోనుండి యవ్వనం లోకి అడుగిడుతూవుందని చెప్పకనే తెలుస్తూవుంటుంది. కాని వారి సందిగ్ధావస్థ అంతా ఆమె ఇంకా మరీ చిన్నపిల్లగాదు అలాగని తగిన వయసూగాదు. మరి అలాంటప్పుడు ఆమెకు వాచ్ అవసరమా అని.

కాని భవిష్యత్తంతా రంగులమయమై తాను కోరినవన్నీ అందుబాటులో వున్నట్లు కనిపించే ఆ వయసులో ఆమెకు ఒక చేతి గడియారం ఒక మామూలు కోరిక కానేరదు. చెప్పాలంటే కాలానుగుణంగావెందే మార్పుల్లో ఆమెకది అత్యవసరమైంది. ఔను మరి ఆమెమాత్రం ఎన్నాళ్ళని వాచ్ లేకుండా వుండ గలదు.

ఆమెకిది ఎదిగే వయస్సు. ప్రకృతి సిద్ధంగా లభించిన వర ప్రసాదము.

అందుకే ఆమెకొక హెచ్ఎంటి వాచ్ కొనండి — ఎందుకంటే ప్రతి మంచి సమయము, యింకొక అందమైన సమయాన్ని అభిలషించేదే.



**hmt** గడియారాలు

## ఆమె జీవితంలోని మధురమైన మరపురాని సమయాల్లో భాగంగా నిలచేవి

మీరు వాచ్ కొన్నప్పుడు గ్యారంటీ కార్డు మరియు క్యాష్‌బిల్లు అడిగి తీసుకోవడము మరచిపోకండి.

వాచ్ డివిజన్

**hmt**

దేశానికి సమయాన్ని సూచించువారు

ఫ్యాక్టరీలు : బెంగళూరు I & II • శ్రీనగర్ • తుంకూరు

CLARION/HMT/8267




## ఔను, మీరూ ఫస్టు రావచ్చు!

## 'రేపిడెక్స్' చదవండి

## ఇతరులను గెలవండి!

* మీ కుటుంబంవారి ప్రీతిని పొందండి.
* మీ స్నేహితులచే మెచ్చబడండి.
* మీ మేష్టారుచే 'శహభాష్' అనిపించుకోండి.




Big Size
Pages : 408
Price : Rs.21/-
Postage : 4/-

ఇంగ్లీషు నేర్చుకునేందుకు ఉత్తమమైన మార్గం—

'రేపిడెక్స్ ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్'

VANDANA/PM/Tel-2

RAPIDEX COURSES Guarantee you success or a full return of Money if dissatisfied

***AVAILABLE AT: leading bookshops, A.H. Wheeler's and Higginbotham's Railway Book Stalls throughout India***

***or ask by V.P.P. from***  **PUSTAK MAHAL** (CM) Khari Baoli, Delhi-110006.
• 10-B, Netaji Subhash Marg, New Delhi-110002.



# చందమామ

మార్చి 1983



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 1-75

సంవత్సర చందా: 21-00

# కొత్త సీరియల్ ప్రారంభం




సచిత్ర మాసపత్రిక

అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట, పి.బి.నెం:331, విజయవాడ-520002.



## అమృత తుల్యమైన

## కథా గమనంతో సాగే

# యద్దనపూడి సులోచనారాణి

## "జలపాతం" సీరియల్ స్వాతి

## ఏప్రిల్ '83 సంచిక లోనే ప్రారంభం

BHALLU

'స్వాతి' ఏప్రిల్ 1983 సంచిక మార్కెట్‌కు విడుదలైనది.

# అభినందనలు!

## క్యాడ్‌బరీస్

# 'జెమ్ చిత్రం'

## పోటీ విజేతలు.




పోటీలో పాల్గొన్న మీ కందరికీ
ృవాదాలు. ఫలితాలు ఇదిగో

ందటి బహుమతి:

మూరి లీనా సక్‌పాల్
బాగ్ 640, వాల్కేశ్వర్ రోడ్, బొంబాయి 6
ిఎ ఎస్ఎల్ఆర్ సైకిల్, 3 స్పీడ్ గేర్, యితర సాధనాలతో
రెలుచుకున్నారు

ండు రెండవ బహుమతులు:

మూరి సుభ్రా సాహా ఎన్ 6 రైల్వే ఆఫీసర్స్
ని, జె.కె. పాల్ రోడ్, న్యూ ఆలీపూర్, కలకత్తా 700 038

మూరి అపర్ణ ఆర్. 4/105 ధిద్యాదేవి వెనకగా
్రాన్, టాంక్ రోడ్, ఎన్. ఆర్. మొహల్లా, మైసూరు 570 007
ఎమ్‌టి కార్టిజ్ చేతి గడియాల రెండవ బహుమతులను
చుకున్నారు.

ాడు మూడవ బహుమతులు:

మూరి ఐశ్వర్యదాస్ కొచ్చిన్ రిఫైనరీస్ స్కూల్
ి. అంబలముగల్, పిన్ రోడ్ 680 302, కేరళ

మూరి గౌరీ వైద్య
/3 గోఖలే రోడ్, పుణె 411 016

మూరి కల్యాణీ సర్కార్
ర్స్ బర్న్ స్టాండర్డ్ కం.లి. పి. ఓ. దుర్గాపూర్ 713 201

300/- విలువగల పుస్తకాల మూడవ బహుమతులను
ుచుకున్నారు.

0 కన్సొలేషన్ బహుమతులు:

్లేషన్ బహుమతులు గెలుచుకున్న వారికి వ్యక్తిగతంగా
ష్లో తెలియబరచడమైనది.



OBM 9716 TL

## క్యాడ్‌బరీస్

చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి, క్యాడ్‌బరీస్ జెమ్స్ తియ్యదనాన్ని అందిస్తాయి.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''దాచినసొత్తు'']కు ఆధారం జెట్టి శంకరరావు రచన.

విద్య ద్వారా మనిషిలోని అజ్ఞానాన్నీ, మూర్ఖత్వాన్నీ పారదోలవచ్చు. కాని, అందుకు విద్య నేర్వదలచినవాడు గురువుకు సహకరించాలి. అలా కానప్పుడు పరిస్థితి ఎంత హాస్యాస్పదంగావుంటుందో, ''గురువుకుపాఠం'' అన్న కథలో వివరించబడింది.

## అమరవాణి

మూర్ఖా యత్ర న పూజ్యంతే, ధాన్యం యత్ర సుసంచితమ్,
దంపత్యోః కలహం నాస్తి, తత్ర శ్రీః స్వయ మాగతా.

[మూర్ఖులకెక్కడ గౌరవం లేదో, ఎక్కడ ధాన్యం సమృద్ధిగా వుంటుందో, భార్యాభర్తలు ఎక్కడ కలహించరో, అక్కడ సంపద సుస్థిరంగా వుంటుంది.]

సంపుటి 72 మార్చి '83 సంచిక 3
విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00





# గురువుకు పాఠం

రమానందుడికి ఎవ్వరూలేరు. చిన్నతనం లోనే తల్లీ తండ్రీపోగా, వాడు ఒక గురుకులాశ్రమానికి వెళ్ళి, అక్కడ గురువుకు శుశ్రూషచేసుకుంటూ జీవించసాగాడు. గురువు చాలా మంచివాడు. ఆయన తన వదకు వచ్చిన ధనికుల బిడ్డలతో పాటు, రమానందుడి క్కూడా సమంగా చదువు చెప్పాడు. ఇరవై ఏళ్ళు వచ్చేసరికి రమానందుడు అన్ని శాస్త్రాలూ నేర్చుకున్నాడు.

ఒక రోజున గురువు, రమానందుణ్ణి పిలిచి దగ్గిర కూర్చోబెట్టుకుని, ''నాయనా, నువ్వు చాలా తెలివైనవాడివి. డబ్బుకు ఆశపడకుండా గ్రామాలకు పోయి, అక్కడి వాళ్ళను విద్యావంతుల్ని చెయ్యి. అభిమానంతో గ్రామస్థులు ఏది ఇచ్చినా తీసుకుని, దానితో తృప్తిపడు. కాని ఎన్నడూ అత్యాశకు మాత్రం పోకు,'' అని చెప్పాడు.

''గురువర్యా, మీరు చెప్పినట్టే నడుచుకుంటాను. మీరు ముందుగా ఏ గ్రామానికి వెళ్ళమంటే, ఆ గ్రామానికి వెళతాను,'' అన్నాడు రమానందుడు వినయంగా.

''ఏ గ్రామానికి వెళ్ళినా ఫరవాలేదు. కాని, పొరబాటున కూడా మూర్ఖాపురానికి వెళ్ళవద్దు. ఈ ఒక్క సలహా గుర్తుంచుకుంటే చాలు,'' అన్నాడు గురువు.

రమానందుడు గురుకులాశ్రమం వదిలి బయలుదేరాడు. అతడి అదృష్టమో, దురదృష్టమోగాని, చీకటిపడుతున్న వేళలో అతడు మూర్ఖాపురమే చేరాడు. ఇక ఆ రాత్రి అక్కడ గడపక తప్పదనుకుని అతడు ఒక గృహస్థుడి ఇంట బసచేశాడు.

గృహస్థు అతణ్ణి, ''ఎవరు నువ్వు, బాబూ? వృత్తి ఏమిటి?'' అని అడిగాడు.

రమానందుడు తనను గురించి చెప్పుకున్నాడు. వెంటనే గృహస్థుడు అతడికి

“వసుంధర”

దణ్ణంపెట్టి, "చిన్నవాడికైనా, బాగా చదువుకున్న వాడైతే, చెయ్యెత్తి మొక్క మని శాస్త్రాలుచెబుతున్నాయి. మా ఊళ్ళో సరైన గురువు లేక పిల్లలు చెడిపోతు న్నారు. నువ్విక్కడే వుండి, మా ఊరి పిల్లలకు చదువు చెప్పాలి," అన్నాడు.



గురువు చెప్పినమాట గుర్తుంచుకుని రమానందుడు ఆఊళ్ళో వుండడం తనకు వీలుకాదన్నాడు. అయితే, మర్నాడు తెల్ల వారేసరికి, ఊరివాళ్ళు చాలామంది రక రకాల కానుకలతో రమానందుడి దగ్గిరకు వచ్చి, తమ పిల్లలకు చదువు చెప్పవలసిం దిగా కోరారు.

ఆ కానుకలు చూసేసరికి రమానందు డికి ఆశపుట్టింది. చదువుకోసం యింతగా తాపత్రయపడే వాళ్లకు, చదువు చెప్పడం తన ధర్మంగా భావించాడు. ఆ విధంగా అతడు గురువు యిచ్చిన సలహాను తోసి పుచ్చాడు!

గ్రామాధికారి రమానందుడి కోసం ఒక చిన్నఇల్లు ఏర్పాటు చేశాడు. అతడు బడి ప్రారంభించే ముందు ఆయన, "నీ బడి సరిగ్గా నడవకపోతే నువ్వు, అదిగో, ఆ కనబడే పెద్ద ఇంట్లో వుండవలసి వస్తుంది!" అని చెప్పాడు.

రమాపతికి, గ్రామాధికారి మాటలు అర్థంకాలేదు.

మూర్ఖాపురం పిల్లలు మహా అల్లరి వాళ్ళు. రమానందుడు ఏంచెప్పినా విన కుండా, అల్లరిచేస్తూండే వాళ్ళు. రమా నందుడు వాళ్లల్లో ప్రతి ఒక్కణ్ణీ శ్రద్ధగా గమనించి, అంతా అల్లరివాళ్ళు కారనీ, వాళ్ళల్లో కొందరు మిగతా వాళ్ళను పాడు చేస్తున్నారనీ గ్రహించాడు. అతడు అల్లరి పిల్లల్ని వేరుచేసి, ఒకరోజున వాళ్ళను కఠినంగా శిక్షించాడు.

ఆ రాత్రే గ్రామాధికారి రమానందుణ్ణి కలుసుకుని, "పిల్లల్ని ఎందుకుకొట్టావు?" అని అడిగాడు.

"వాళ్ళు అల్లరి చేశారు, కొట్టాను!" అన్నాడు రమానందుడు.



నీ వల్ల, ఏ చదువూ రావడం లేదని, గ్రామంలో అంతా అంటున్నారు,'' అన్నాడు.

''మీ పిల్లలెవరికీ చదువు రాకపోవడానికి, నేను కారణం కాదు; ఆ పిల్లల తల్లిదండ్రులు!'' అన్నాడు రమానందుడు.

''అయితే, ఏంచేయమంటావు?'' అని అడిగాడు గ్రామాధికారి.

''గ్రామంలోని పెద్దలందర్నీ ఒకచోట చేర్చండి. వాళ్ళ పిల్లలకు బాగా చదువు రావడానికి ఇంట్లో ఏం చేయాలో, నేను వివరించి చెబుతాను,'' అన్నాడు రమానందుడు.

''అల్లరి పిల్లలు చేయకపోతే, నువ్వూ నేనూ చేస్తామా?'' అన్నాడు గ్రామాధికారి కోపంగా.

రమానందుడికేం జవాబివ్వాలో తెలియలేదు. గ్రామాధికారి ''చిన్న పిల్లలు భగవంతుడితో సమానమని శాస్త్రాలు చెబుతున్నాయి. వాళ్ళనింకెప్పుడూ కొట్టకు. కొట్టకుండా చదువు చెప్పు,'' అన్నాడు.

ఆ తర్వాత రమానందుడు పిల్లల్ని కసురుకోకుండా, కొట్టకుండా మంచిగా వుండాలని ప్రయత్నించాడు. అందువల్ల ఏ ఒక్కడికీ అక్షరం ముక్క వంటబట్టలేదు.

కొన్నాళ్ళ తర్వాత గ్రామాధికారి మళ్ళీ రమానందుణ్ణి కలుసుకుని, పిల్లలెవరికీ

రమానందుడు కోరినట్టే పెద్దల సమావేశం ఏర్పాటయింది. పిల్లలను క్రమశిక్షణలో ఎలా పెంచాలో రమానందుడు వాళ్ళకు చెప్పాడు. ఇంటివద్ద ఎలా చదివించాలో, అవసరమయితే వాళ్ళనెలా శిక్షించి భయపెట్టాలో కూడా వివరించాడు.

''పిల్లల చదువూ, బుద్ధిగా నడుచుకోవడం—అంతా తల్లిదండ్రులు చూసుకుంటే, ఇంక బడి ఎందుకు? గురువు ఎందుకు?'' అన్నాడు గ్రామాధికారి.

అక్కడ చేరిన చాలామంది పెద్దలకూడా, యిదే సందేహం కలిగింది. రమానందుడు ఎంత వివరించినా, వాళ్ళు యిదే ప్రశ్న మళ్ళీ, మళ్ళీ అడగసాగారు.

రమానందుడు చేసేదిలేక, ''నే నెంత చెప్పినా మీకు అర్థం కావడం లేదు,'' అన్నాడు దిగులుగా.

గ్రామాధికారి వెంటనే, ''పెద్దవాళ్ళం మాకే అర్థమయ్యేలా చెప్పలేని వాడివి, పిల్లలకేం చదువు చెప్పగలవు? నువ్వు కొన్నాళ్ళు, ఆ పెద్ద ఇంట్లో వుండవల సిందే!'' అన్నాడు.

ఆ పెద్దిల్లు ఏమిటో చూడాలని రమా నందుడికీ కుతూహలంగానే వున్నది. అతడు అక్కడికి వెళ్ళి లోపలికి అడుగు పెట్టగానే, బయటినుంచి గ్రామాధికారి తలుపుకు గొళ్ళెం పెట్టాడు.

లోపల కొందరు మనుషులున్నారు. వాళ్ళల్లో ఒకడు రమానందుణ్ణి చూసి, ''మనకు ఈ రోజు మరొక కొత్త స్నేహితుడు వచ్చాడు!'' అంటూ పెద్దగా అరిచాడు.

''మీరెవరు?'' అని అడిగాడు రమా నందుడు వాళ్ళను.

''ఈ ఊళ్ళో పిల్లలకు పాఠాలు చెప్పా లని వచ్చి, భంగపడిన వాళ్ళం. ఈ కారా గారానికి రోజూ కొందరు పిల్లలు వచ్చి, గురువులంటే ఎలా వుండాలో మనకు పాఠాలు చెబుతారు. వాళ్ళ వెంట మెరిక ల్లాంటి నలుగురు వస్తాదులుంటారు,'' అన్నాడు వాళ్ళల్లో ఒకడు.

గురువుగారి మాట విననందుకు తనకు తగిన శిక్షే పడిందనుకున్నాడు, రమా నందుడు. ఇప్పుడు అంతా కలిసి బయట



పడే మార్గం చూడాలి! మొత్తం పది మంది వున్నారక్కడ.

మర్నాడు అక్కడి గురువులందరికీ పాఠాలు చెప్పడానికి పిల్లలు వచ్చారు. రమానందుడు వాళ్లతో, "మీరంతా ఎంతో అదృష్టవంతులు! ఏ శ్రమా లేకుండా ఒక్క గంటలో సకల శాస్త్రాలూ నేర్చుకునే అవకాశం వున్నది," అన్నాడు.

"ఎలాగో చెప్పండి!" అన్నాడొక పిల్లవాడు.

"ఇంతమంది గురువులం ఏకకంఠంగా సరస్వతీనామ స్తోత్రం చేస్తే, దేవిప్రసన్నురాలై, చుట్టుపక్కల వున్న జనానికి విద్యాదానం చేస్తుంది," అన్నాడు రమానందుడు.

పిల్లలంతా వెళ్ళి, యీ సంగతి గ్రామంలోని పెద్దలకు చెప్పారు. కొద్దిసేపట్లో పెద్దింటి ప్రాంతం జనంతో కిటకిటలాడిపోయింది.

రమానందుడు పెద్దగా గొంతెత్తి, "ఎక్కడ మూర్ఖత్వం వున్నదో, అక్కడ సరస్వతి వుండదు. మేం పదకొండుమందిమీ, సరస్వతీ నామ స్తోత్రంచేస్తూ నడక ప్రారంభిస్తాం. సరస్వతీ కటాక్షం కావాలనుకున్నవాళ్ళు, మా వెనకనే బయల్దేరండి!" అన్నాడు.

రమానందుడితోపాటు గురువులందరూ ఊరి పొలిమేరలకేసి నడుస్తూ, పెద్దగా సరస్వతీనామ స్తోత్రం ప్రారంభించారు. వాళ్ళ వెనక మూర్ఖాపురం ప్రజలు!

ఊరి పొలిమేరలు దాటగానే రమానందుడు వాళ్ళతో, "సరస్వతీదేవి మమ్మల్ని వేగంగా పరుగుతీయమని, మిమ్ములను పొలిమేర దగ్గిరే ఆగి పొమ్మంటున్నది!" అని, మిగతా వాళ్లతో కలిసి పారిపోయాడు.

ఆ తర్వాత రమానందుడు తన విద్యను ప్రదర్శించి రాజాశ్రయం సంపాయించాడు. అతడు రాజుకు మూర్ఖాపురం ప్రజలతో తనక్కలిగిన అనుభవం చెప్పి, ఆ ఊరి వాళ్ళకు బలవంతంగా చదువు చెప్పించే ఏర్పాట్లు చేయించాడు.






# 17

[సముద్రకేతుడి దొంగలతో, శివదత్తుడు కొద్దిసేపు యుద్ధం చేసి, అడవిలోకి పారిపోయాడు. అక్కడ వారికి దేవమాయి అన్న పేరుగల స్త్రీ కనబడింది. ఆమె వల్ల, శివదత్తుడు మకర మండల వృత్తాంతం విన్నాడు. వజ్రముష్టి ఇరువురు అనుచరులతో దారి చూపుతూ ముందు బయలుదేరాడు. అతనికి సముద్రకేతుని దొంగల ముఠా కనిపించింది. తరవాత —]

వజ్రముష్టి, ఉప్పుటేరు అవతలినుంచి వినవస్తున్న వికృతమైన సవ్వడి విని, తన అనుచరుల వైపుకు తిరిగి: "అది సముద్రకేతుడి దొంగల ముఠా అయివుండవొచ్చు. వాళ్ళెవరైనా — తాగి తందనాలాడుతున్నారని మాత్రం తెలుస్తూనే ఉంది. మీరిక్కడే ఉండండి, నేను తెలుసుకుని వస్తాను!" అంటూ నేల మీద పాకుతూ పోయి, నీటి ఒడ్డునే ఉన్న ఒక తెప్పను చేజిక్కించుకున్నాడు.

కొద్దిసేపట్లో వజ్రముష్టి అవతలి ఒడ్డు చేరాడు. అతడు తెప్పను ఒడ్డున ఉన్న ఒక అడవిచెట్టుకు బంధించి, పాకుతూ ముందుకు వెళ్ళాడు. సమతలంగా ఉన్న ఒకచోట దాదాపు పదీ పన్నెండుమంది సముద్రకేతుడి అనుచరులు, తమ తమ ఆయుధాలను కుప్పగా ఒకచోట పడవేసి,




ఒళ్ళు మరిచేలా తప్ప తాగి కేకలు పెడు తున్నారు.

వాళ్ళను హతమార్చేందుకు, వజ్ర ముష్టికి ఇదే మంచి అదనుగా కనిపించింది. అతడు ఒక్క దూకులో పొద మాటు నుంచి ముందుకు ఉరికి, "జై, కాలకేయా!" అంటూ కత్తిదూసి దొంగల మీదికి వురికాడు.

తమ మీదికి ఎలాంటి ఘోర ప్రమాదం ముంచుకు వస్తున్నదో దొంగల్లో కొందరికైనా తెలిసేలోపల, వజ్రముష్టి చేతివాడికత్తి వాళ్ళ తలలను మొండెం నుంచి వేరుచేసింది. ఇంతలో తెప్పరిల్లిన నలుగురైదుగురు, భీకరంగా అరుస్తూ తమ తమ అయుధాల కేసి పరిగెత్తే లోపల, వజ్ర ముష్టి వారిని కూడా తుదముట్టించాడు.

ఒక్కగానొక్క దొంగ మాత్రం ఆ గందరగోళంలో వజ్రముష్టి నుంచి తప్పుకుని ఉప్పుటేరు కేసి పరిగెత్తగలిగాడు. కాని వజ్రముష్టి అతణ్ణి వదలదలచలేదు. బ్రతికి బయటపడిన ఒక్క దొంగ అయినా తమకు ముప్పు కలిగించగలడని అతనికి తోచింది.

వజ్రముష్టి, "జై, కాలకేయా!" అని అరుస్తూ, పారిపోతున్న దొంగ కేసి పరిగెత్తాడు. నిరాయుధుడూ, తాగిన మత్తులో తడబడుతూ వున్న ఆ సముద్రపు దొంగ వెనుతిరిగి వజ్రముష్టి భీకరాకారం కేసి ఒకమారు చూసి, "చచ్చాను!" అని పెద్దగా అరుస్తూ, ఒక్క గెంతున, ఎదురుగా వున్న ఉప్పుటేట్లో దూకాడు.

వజ్రముష్టి కూడా అతడి వెనుకనే ఏటిలో దూకబోయేంతలో, తాటిబొందులా అప్పటివరకూ నీటిలో తేలుతున్న మొసలి ఒకటి ఆ సముద్రపు దొంగ మీదికి వురికింది. కన్ను మూసి తెరిచేంతలో మొసలి, ఆ దొంగను నోటకరచుకుని పారిపోయింది.

వజ్రముష్టి 'హ హ్హ హ్హ' అంటూ బిగ్గరగా నవ్వి, తరవాత పళ్ళు కొరుకుతూ, "సముద్రకేతుడికి కూడా ఇలాంటి చావు తప్పదు! నా చేతిలో .... లేకపోతే....

మొసలి వాతబడి....జై, కాలకేయా!'' అంటూ అరిచాడు.

ఆ సరికి, వజ్రముష్టి వెంట వచ్చిన ఇద్దరు అనుచరులూ ఏటి ఒడ్డుకు వచ్చి, వజ్రముష్టి కేసి చేతులు ఊపారు. ఇక జాగుచేయటం మంచిదికాదని భావించి వజ్రముష్టి, తక్షణమే ఒక తెప్పకొయ్య మీద ఎక్కి యివతలి ఒడ్డుకు చేరాడు.

వజ్రముష్టి ఏకాకిగా అంతమంది శత్రువులను హతమార్చటం చూసిన అనుచరులిద్దరూ అతడి ధైర్య సాహసాలను వేనోళ్ళ మెచ్చుకున్నారు. తరవాత అందరూ కలిసి శివదత్తుడు వున్నచోటుకు వెళ్ళారు.

వజ్రముష్టిని అంతదూరాన చూస్తూనే శివదత్తుడు, ఎదురువచ్చి, ''వెళ్ళిన పని ఏమైంది? సముద్రకేతుడి అనుచరులు ఆ ప్రాంతాల ఎక్కడా లేరుగదా?'' అని ప్రశ్నించాడు.

వజ్రముష్టి జరిగిన దేమిటో చెప్పేందుకు బిడియపడుతున్నంతలో, వెంట వున్న అనుచరు లిద్దరూ శివదత్తుడికి అతడు చేసిన సాహసకార్యం గురించి వర్ణించి చెప్పారు. శివదత్తుడూ, మందర దేవుడూ వజ్రముష్టి సాహసానికి అచ్చెరువందారు.

''వజ్రముష్టీ! నీ సాహసం కొనియాడ దగిందే! నీవు లోగడ కోరినట్టు అవకాశం




వుంటే, సముద్రకేతుణ్ణి హతమార్చే పని నీకే వదులుతాను!'' అన్నాడు శివదత్తుడు ఉత్సాహంగా.

దేవమాయి, సముద్రకేతుడి పేరు వింటూనే కోపోద్రేకురాలై, ''అయ్యా! వజ్రముష్టి కత్తి వాతపడి మరణించిన వాళ్ళు, ఈ ప్రాంతాల వాడు కాపు వుంచిన వాళ్ళయి ఉంటారు. కనుక ఇప్పుడు మనం ఎవరి కంటా బడకుండా అతడి నివాస స్థానం చేరవచ్చు. ఇక్కడికి షుమారు నాలుగైదు కోసుల దూరంలో అతడు వుంటున్న ప్రదేశం ఉంది. అక్కడికి మనం చేరాలంటే పడవల మీద వెళ్ళవలసిందే!'' అన్నది.




''సముద్రకేతుడు వుండేది, పెద్ద దుర్గం లాంటి ప్రదేశం కాదుగదా?'' అని అడిగాడు శివదత్తుడు.

అందుకు దేవమాయి, ''అక్కడ దుర్గం లాంటి కట్టడాలేమీ లేవు. ఆ ప్రదేశమంతా సముద్రజలంతో నిండి వుంటుంది. అక్కడక్కడా ఎత్తయిన భూప్రదేశాలు వున్నవి. అతడు ఉంటున్న ప్రదేశం అలాంటి వాటిలో ఒకటి. అతడికి రక్షణ, ఆ ప్రదేశం చుట్టూ ఉన్న ఉప్పునీరు మాత్రమే!'' అన్నది.

''అతడి అనుచరులు చాలామంది ఉన్నారుగదా?'' అని అడిగాడు శివదత్తుడు.

''అనుచరులకేం, చాలా మంది వున్నారు: కాని వాళ్ళను మించిన బానిసలూ, శత్రువులు కూడా అక్కడే ఉన్నారు. నేను చాలాకాలం అక్కడే బానిసగా బంధింపబడ్డాను. ఒకసారి మనం, ఆ బానిసలు ఉండే చావళ్ళలో జొరబడి వాళ్ళను బంధవిముక్తుల్ని చేయగలిగితే, ఆ తరవాత మన వాళ్ళే సముద్రకేతుణ్ణీ, అతడి అనుచరుల్ని తుద ముట్టించ గలరు!'' అన్నది దేవమాయి ఉద్రేకంగా.

''ఆ బానిసలు షుమారుగా ఎంత మంది వుంటారు?'' అని ప్రశ్నించాడు శివదత్తుడు.

''అయిదువందలు....ఆరువందలు—అంతకు తక్కువ మాత్రం ఉండరు!'' అన్నది దేవమాయి.

''అయితే, ఇక మనం అక్కడికి బయలుదేరుదాం. వజ్రముష్టి సంపాయించిన చిన్న పడవల సహాయంతో, మన మందరం లోతులేని ఈ ఉప్పుటేర్ల వెంట పోయి, ఆ సముద్రకేతుడి గుహ చేరగలం! చీకటిపడుతున్నది. శత్రువును ఏమరుపాటున ఎదుర్కొని, చావుదెబ్బ కొట్టేందుకు ఇదే మంచి అదను!'' అన్నాడు శివదత్తుడు.

అందరూ ఉప్పుటేరు దగ్గిరకు బయలుదేరారు. కొద్దిసేపట్లోనే వారు కనుచూపు

మేర జలమయంగా వుండి. మధ్య పచ్చని చెట్లతో వున్న ఒక మిట్ట ప్రదేశాన్ని చేరారు. సముద్రపు దొంగలు విడిచిన పడవలు అక్కడే చెట్లకు కట్టబడి వున్నవి. అందరూ వాటి మీద ఎక్కి దేవమాయి చూపిన దిక్కు కేసి బయలుదేరారు.

అ సరికి బాగా చీకటిపడిపోయింది. నెలవంక ఎక్కడో మేఘాల మాటున వెల వెలపోతోంది. అక్కడికి చాలా దూరంగా, సముద్రకేతుడి నివాసస్థానం వున్న చిన్న ద్వీపఖండంలో మినుకుమినుకుమని వెలిగే దివిటీల కాంతి తప్ప—చుట్టూ, భీతి కొలిపే గాఢాంధకారం!



అ అంధకారంలో ఒకరినొకరు హెచ్చరించుకుంటూ, పడవలు ఒకదాని నొకటి తాకి ప్రమాదం సంభవించకుండా జాగ్రత్త పడుతూ, శివదత్తుడు క్రమక్రమంగా ముందుకుపోసాగాడు. దారిలో అక్కడా ఇక్కడా వున్న మిట్టప్రదేశాల మీది చెట్ల లోంచి, నీటి పక్షుల అరుపులు వికృతంగా వినిపిస్తున్నవి. నీటిలో అహార సంపాదనకు తిరిగే మొసళ్ళూ, తదితర క్రూర జంతువులూ పడవల వరకూ వచ్చి, వాటిమీద మనుష్యులు కనబడగానే దూరంగా పారిపోతున్నవి.

దాదాపు నడిరాత్రి వేళకు శివదత్తుడు తన అనుచరులతో సముద్రకేతుడు నివసించే మిట్టప్రాంతపు చాయలకు చేరాడు. ఇప్పుడు చేయవలసింది, ఏమాత్రపు-చడీ చప్పుడూ కాకుండా, పశువుల వలె చావళ్ళలో బంధింపబడి వున్న బానిసలను బంధవిముక్తుల్ని చేయుటం. అటు పైన అ బానిసల వాళ్ళ సాయంతో సముద్రకేతుణ్ణీ అతడి అనుచరులనూ హతమార్చటం!

శివదత్తుడు ఇలా భావించేంతలో, అతడు చేరవలసిన ప్రదేశం సమీపించింది. అందరూ నిశ్శబ్దంగా పడవల మీది నుంచి ఒడ్డుకు దిగారు. తరవాత చెట్ల చాటున నక్కుతూ కొంతదూరం వెళ్ళేసరికి, హఠాత్తుగా అ ప్రాంతాన్నంతా పట్టపగలు



చేస్తూన్న అనేక వందల దివిటీల కాంతి వాళ్ళ కళ్ళబడింది.

శివదత్తుడు వెంటనే ఆ కాంతి ప్రసరించని గుబురు చెట్ల చాటున దాక్కుని తన అనుచరులను పొంజ్ఞలతో దగ్గిరకు పిలిచాడు.

అందరూ చెట్ల ఆకుల చాటున వుండి, దివిటీల కాంతి వచ్చిన వైపు చూశారు. అక్కడ దాదాపు నలభై యాభై మంది, సముద్రపు దొంగలు, కొందరు నిలబడీ, మరికొందరు కూర్చునీ వాళ్ళకు కనిపించారు. సముద్రకేతుడు చేతిలో పానపాత్ర పట్టుకుని, మధ్య మధ్య మద్యం సేవిస్తూ, కవచధారులై వున్న నలుగురైదుగురు వ్యక్తులతో రహస్యంగా ఏమో మాట్లాడుతున్నాడు.

దేవమాయి, తన చూపుడువేలిని వాళ్ళకేసి చూపుతూ, "ఆ నలుగురూ మకర మండల రాజైన హరిశిఖుడి సైనికులు! తెల్లవారితే మకరదేవతకు కావలసిన ఆహారం కోసం ఇక్కడికి వచ్చారు. సముద్రకేతుడు బంధించి తెచ్చినవారిలో, యుక్తవయస్కులూ, ఆరోగ్యవంతులైన వారిని ఎంత వెల అయినా ఇచ్చి కొనుక్కుని వాళ్ళు మకర మండలానికి వెళతారు!" అని చెప్పింది.

శివదత్తుడు ఆమె మాటలకు ఆశ్చర్యపోయి, "మకరదేవతకు ఆహారంగా వేసేందుకు మానవులు తప్ప జంతువుల్లాంటివి పనికిరావా? అది ఎంత దేవత అయినా మొసలి గదా!" అన్నాడు.

"మకరమండల వాసులంతా దాన్ని దేవతగానే చూసుకుంటారు, బహుశా క్షుద్ర దేవతగా కావొచ్చు! అది అంటే వారికి ఎక్కడలేని భయం. దానికి జంతువులను బలి ఇవ్వటమంటే, వాళ్ళు అపచారంగా భావిస్తారు," అన్నది దేవమాయి.

"ఒకవేళ ఆ మూఢులు భావించేదే నిజమైతే, ఆ క్షుద్రదేవత పాలిటి యముడు మన వెంటనే ఉన్నాడు!" అంటూ శివదత్తుడు, వజ్రముష్టి కేసి చూస్తూ నవ్వాడు.

" నేను ఆ ఒక్క మకరదేవతకే కాదు, ఈ క్రూర సముద్రకేతుడి పాలిటి కూడా యముణ్ణి!" అన్నాడు వజ్రముష్టి కోపంతో.

" సరే, ఇక మనం నిశ్శబ్దంగా వెళ్ళి, ఆ బంధితులైన బానిసల్ని విడిపించటం క్షేమం. ఒకవేళ ఆ ప్రయత్నంలో విఫలుల మైతే, మనం వచ్చిన పడవలు ఇక్కడ వుండనే ఉన్నవి. వాటి సాయంతో పారిపో వచ్చు!" అన్నాడు శివదత్తుడు.

దేవమాయి, బానిసలు బంధించబడి వున్న చావిళ్ళ కేసి దారితీసింది. అందరూ చెట్ల చాటున నక్కుతూ, అటుకేసి నడి చారు. కొద్దిసేపట్లోనే వారు పశువుల శాల లాగా వున్న ఒకచోటికి వచ్చారు. దానిలో పశువుల్లా కట్టుకొయ్యలకు వరసగా చాలా మంది మనుష్యులు కాళ్ళూ చేతులకు సంకెళ్ళు వేయబడి బంధింపబడి వున్నారు.

శివదత్తుడు, అనుచరులను హెచ్చరించి మెల్లగా శాలలో ప్రవేశించాడు. వజ్రముష్టి సోలుపుగా కట్టివేయబడిన ఆ బానిసల దగ్గరకు వెళ్ళి, ప్రతి ఒక్కడికీ తాము వచ్చిన పని చెప్పి, నిశ్శబ్దంగా వుండవలసిం దని హెచ్చరించాడు.

తమ దగ్గిర వున్న ఆయుధాలతో శివ దత్తుడూ, అతడి అనుచరులూ ముందుగా కొందరు బానిసల సంకెళ్ళు వూడగొట్టారు. అలా బంధవిముక్తులైన బానిసలు త్వర



త్వరగా తమ తోటివారిని బంధవిముక్తుల్ని చేశారు.

ఈ విధంగా కొద్దిసేపట్లో ఆ చుట్టు పక్కల శాలల్లో వున్న అందరు బానిసలూ బంధ విముక్తులయ్యారు.

స్వయంప్రభ ఎక్కడ? ఈ ప్రశ్న దేవ మాయినీ, మందరదేవుణ్ణి కూడా మొదటి నుంచీ బాధిస్తూనే వుంది. వాళ్ళు చాలా మంది బానిసలను అడిగిచూశారు. వాళ్లల్లో ఎవ్వరికీ ఆవిడను గురించి తెలియదు. స్వయంప్రభను ఈసరికే మకరదేవతకు ఆహారంగా వేశారా? అని వాళ్ళు భయ పడేంతలో, ఒక బానిస ముందుకు వచ్చి, " అయ్యా, ఇంతకుముందే కావలివాళ్లు

ఒక సౌందర్యవతి అయిన కన్య దొరికి నట్టూ, ఆమెను చాలా వెలకు సముద్ర కేతుడు ఎవరికో అమ్మబోతున్నట్టూ మాట్లాడుకోవటం విన్నాను!'' అన్నాడు.

ఈ వార్త దేవమాయితోపాటు అందరికి చాలా పూరట కలిగించింది. మందర దేవుడు శివదత్తుడి దగ్గిరకు వస్తూ, ''శివదత్తా! ఇక్కడ ఇంతమంది బానిసలు ఉన్నారు గదా? వీళ్ళకు కాపలా అంటూ ఎవరూ లేకపోవటం వింతగా లేదా?'' అని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

శివదత్తుడు ఆ ప్రశ్నకు నవ్వి, ''ఈ సముద్ర జలం మధ్య ఈ మిట్ట మీద కాళ్ళూ, చేతులూ గొలుసులతో బంధింపబడిన వ్యక్తులు ఎక్కడికి పోగలరు? సరే, ప్రస్తుత కర్తవ్యం సంగతి ఆలోచిద్దాం! స్వయంప్రభ ఈ ప్రాంతంలోనే ఎక్కడో ఉండి ఉంటుంది. మనం ఒక్కుమ్మడిగా ముందు సముద్రకేతుడి మీద పడి, వాణ్ణి అనుచరులతో సర్వనాశనం చేద్దాం!'' అన్నాడు.

ఈ లోపల వజ్రముష్టి బానిసలందరినీ ఒకచోట చేర్చి, వాళ్ళకు కర్రలూ, ఇనప చువ్వలూ-- ఈ విధంగా ఏది దొరికితే అది ఇచ్చి, సర్వసన్నద్ధం చేశాడు. శివదత్తుడి ఆజ్ఞ కాగానే అందరూ మూడు భాగాలుగా విభజింపబడ్డారు. శివదత్తుడూ, మందర దేవుడూ, వజ్రముష్టి ఆ మూడు భాగాలకూ ముందుండి దాడి ప్రారంభించాలని నిర్ణయించబడింది.

అందరూ చెట్ల చాటునగల చీకటి ప్రాంతాల వెంట నిశ్శబ్దంగా నడిచి, ఒకేసారి మూడు వైపుల నుంచి సముద్రకేతుడి మీదికి భయంకరంగా అరుస్తూ దూకారు.

అంత హఠాత్తుగా మూడు వైపుల నుంచి ఒకేసారి తమ మీదికి దూకిన భీకర శత్రువు లెవరో తెలుసుకుని ప్రతిఘటించేలోపల, సముద్రకేతుడి దొంగల ముఠాలో చాలామంది, శివదత్తుడి అనుచరులవాడి కత్తులకు బలి అయిపోయారు.

—(వచ్చే సంచికలో ముగింపు)





# దాచిన సొత్తు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు పడుతున్న యింత శ్రమకూ కారణం, నీ జాతకప్రభావమా లేక విధివైపరీత్యమా అన్న అనుమానం కలుగుతున్నది. కొందరు బలవంతుల చేతబడి, చేసేది లేక బానిసత్వం అనుభవిస్తారు. మరి కొందరు అలాంటి దురదృష్టపరిస్థితులు ఏవీ లేకుండానే, పుట్టుబానిసల్లా ప్రవర్తిస్తారు. ఈ రెండవ తరహాకు చెందిన హనుమయ్య అనే ఒక విచిత్రవ్యక్తి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు :

కాంచీపురంలోని ధనగుప్తుడు, తోటి వర్తకులందరినీ మించిన మహా ఐశ్వర్య

## బేతాళ కథలు



వంతుడు. తాతముత్తాతలూ, తండ్రి కొల్లలుగా సంపాదించి అప్పగించిన సంపదలే కాకుండా, ధనగుప్తుడు పర రాజ్యాలకు కూడా తన వ్యాపారాన్ని విస్త రించి, లక్షలకు లక్షలు గడిస్తూండేవాడు.

ఇన్ని సంపదలు వున్నా ధనగుప్తుడికి పిసరంతయినా మనశ్శాంతి లేదు. అతడికి వయసు మీరి వృద్ధాప్యం వచ్చి పడు తున్నది. కాని, సంతానం మాత్రం కలగ లేదు. మందులేని మనోవ్యాధిగా మారిన యీ చింత, అతడి భార్య కనకమహా లక్ష్మిని కూడా వేధించసాగింది.

ఈ పరిస్థితుల్లో, వ్యాపారపు పనుల్లో క్షణం తీరిక లేకుండా వున్న భర్తకు తోచని ఒక ఉపాయం కనకమహాలక్ష్మికి తోచింది.

ఒకనాటి రాత్రి అమె భర్తకు వడ్డన చేస్తూ, ఆ ఉపాయమేదో చెప్పింది.

ధనగుప్తుడు నిశ్చేష్టుడై, "నువ్వు ఉత్త వెర్రిదానివి! కోరి సవతిని తెచ్చి పెట్ట మంటున్నావు. నువు చెప్పినట్టు, నీ పిన తల్లి కుమార్తె శ్రీమతి అన్నివిధాలా యోగ్యురాలే. కాని, ఆ పిల్ల వయసు, నీ వయసులో సగానికి కూడా తక్కువ. ఇటువంటి పెళ్ళి, ఏ విధంగా చూసినా, శ్రేయస్కరం కాదు," అన్నాడు.

వాళ్ళకు తమ పిల్లల్ని దత్తు యివ్వ డానికి ఎందరో బంధువులు ఎగబడు తున్నారు. కాని, దత్తత భార్యా, భర్త లిద్దరికీ యిష్టంలేదు. దత్తుడు, దత్తుడే కాని సొంతబిడ్డ కాదుగదా!

భర్త తన సలహా తోసిపుచ్చినప్పటి నుంచీ కనకమహాలక్ష్మి మరింతగా దిగులు పడసాగింది. కొన్నాళ్ళ తర్వాత ఆమె, ఆ దిగులుతోనే కన్ను మూసింది. భార్య మరణం ధనగుప్తుడిలో చాలా మార్పు తెచ్చింది.

అతడు భార్య సలహాను పాటించ నందుకు కొన్నాళ్ళు బాధపడి, చివరికి శ్రీమతిని వివాహమాడేందుకు నిర్ణయించు కున్నాడు.



ఆడంబరాలేమీ లేకుండా శ్రీమతితో ధనగుప్తుడి వివాహం జరిగిపోయింది శ్రీమతి కాపరానికి వచ్చి ఏడాది తిర క్కుండానే ధనగుప్తుడి కోరిక యీడేరింది ఆమె పండంటి కొడుకును కన్నది. అతడికి ధనగుప్తుడు, లక్ష్మప్రసన్నుడని తన తండ్రి పేరు పెట్టుకుని అల్లారుముద్దుగా పెంచసాగాడు.

లక్ష్మప్రసన్నుడికి పన్నెండేళ్ళ వయసు వచ్చేసరికి, ధనగుప్తుడు డెభ్భై ఏళ్ళ వయసు వాడయ్యాడు. అతడినిప్పుడు మరొక చింత పట్టుకున్నది. కీడెంచి మేలెంచాలి గదా—తన తదనంతరం ఇంత గొప్ప ఆస్థిపాస్తుల్ని సంరక్షించుకోవడం ఆడవాళ్ళవల్ల అయే పనికాదు. శ్రీమతి యింకా చిన్నపిల్ల; అంతగా లోకజ్ఞానం లేనిది!

ఈ చిక్కు సమస్యకు పరిష్కార మేమిటా అని ధనగుప్తుడు సతమతమవు తుండగా, అతడికి హఠాత్తుగా ఒక మంచి ఆలోచన తట్టింది. వ్యాపారంలో పెట్టు బడిగా వున్న సొమ్మూ, స్థిరాస్తులూ కాక, వజ్రవైడూర్యాలూ, బంగారం ఎంతో తన ఇంట ఇనప భోషాణాల్లో మూలుగు తున్నది. లక్ష్మప్రసన్నుడు యుక్తవయస్కు డయే దాకా, ఆ ధనం పరులపాలు కాకుండా కాపాడే నమ్మకస్థుడైన వాడొకడు కావాలి! అందుకు తగినవాడు హను మయ్య అన్న విశ్వాసం ధనగుప్తుడికి కలిగింది.

ఈ హనుమయ్య, ధనగుప్తుడి నౌకర్లలో ఒకడు. పసితనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న అతణ్ణి, ధనగుప్తుడు ఆద రించి పెంచి పెద్దవాణ్ణి చేశాడు. దుకాణం లోనూ, ఇంటి దగ్గిరా కూడా అతడు ధనగుప్తుడికి నీడలా మెసులుకునేవాడు. అతడికి తన యజమానిపట్ల చెప్పనలవి కాని భక్తివిశ్వాసాలున్నవి. వ్యాపారరీత్యా పర రాజ్యాలకు వెళ్ళినప్పుడు ధనగుప్తుణ్ణి ఒకటి, రెండుసార్లు ప్రమాదాల నుంచి తన ప్రాణం అడ్డువేసి కాపాడాడు.



ఒకనాటి రాత్రివేళ ధనగుప్తుడు, హను మయ్యను తన గదికి తీసుకుపోయి, ''ఒరే, నీ వంటే నా కెంత నమ్మకమో, నువ్వెరగనిది కాదు. నేను, నీ కొక అతి ముఖ్యమైన పని ఒప్పజెప్పబోతున్నాను. నమ్మకంగా చేస్తానని మాట యివ్వాలి,'' అన్నాడు.

''అయ్యా, మీ మాట ఎప్పుడు కాదన్నాను, చెప్పండి! మీ పాదాలంటి ప్రమాణంచేసి, మీ ఆజ్ఞ నెరవేరుస్తాను,'' అన్నాడు హనుమయ్య.

''ప్రమాణం నా పాదాలంటి కాదు. గోడను వేలాడుతున్న రాములవారి పటం నెత్తిన పెట్టుకుని ప్రమాణం చెయ్యి, నాకు తృప్తిగా వుంటుంది,'' అన్నాడు ధనగుప్తుడు.

హనుమయ్య అలాగే చేశాడు.

అప్పుడు ధనగుప్తుడు, ''ఒరే, హను మయ్యా, నే నింకా బతికినన్నాళ్ళు బత కను గదా. వయసు చెల్లిపోతున్నకొద్దీ చిన్నబాబు లక్ష్మీప్రసన్నుడిని గురించిన చింత నన్ను ఎడ తెగకుండా వేధిస్తున్నది. తాతముత్తాతల నుంచీ వస్తున్న ఆస్థి, మా వంశానికి కాకుండా పోతుందేమో అన్న బెంగ నన్ను బాధిస్తున్నది. ఆ ఆస్థి పాస్తులు నిలబెట్టగలవాడివి నువ్వే!'' అన్నాడు.

ఆ తరవాత ధనగుప్తుడు, హను మయ్యాకు చెప్పదలచినదంతా చెప్పాడు. ఇది జరిగిన ఆరు నెలలకే ఆయన కాలం చేశాడు. ధనగుప్తుడి కుటుంబాన్ని హను మయ్య ఎటువంటి కొరతా లేకుండా తన కంటి పాపలా కాపాడసాగాడు. యజ మాని లేడన్న లోటు కనబడకుండా వ్యాపారం సాగిపోతున్నది.

అపర కుబేరుడులాంటి ధనగుప్తుడి ఐశ్వర్యానికి, హనుమయ్యలాంటి నౌకరు సంరక్షకుడు కావడం చాలామందికి ఆశ్చ ర్యంతోపాటు, అనుమానాలు కూడా కలి గించింది. తగు జాగ్రత్తలో లేకపోతే, ఆ తల్లీకొడుకులకు హనుమయ్య ద్రోహం

చేస్తాడని కూడా చాలామంది భావించారు. ఈ విషయమై కొందరు శ్రీమతిని హెచ్చరించసాగారు.

ఈ చెప్పుడు మాటలు వినీ, వినీ శ్రీమతికి హనుమయ్య మీద కొంచెం అనుమానం కలిగి, ఒకనాడు అతడితో, "హనుమయ్యా, లక్ష్మీప్రసన్నుడికి తన సొంత కాళ్ళ మీద తాను నిలబడగలిగే వయసు వస్తున్నది. వాడి తండ్రిగారు, సొత్తంతా నీ కాపుదలలో వున్నదని చెప్పారుగాని; అదెక్కడ వున్నదో మాత్రం చెప్పలేదు," అన్నది.

దానికి హనుమయ్య, "అయ్యగారు, ఆ సొత్తంతా చిన్నబాబుకు యుక్తవయస్కుడు కాగానే అప్పగించమన్నారు. మరొక నెలరోజుల్లో బాబుకు ఎలాగూ ఇరవైఏళ్ళు నిండబోతున్నవి కదా! మీరు కొంచెం ఓపికపట్టండి," అన్నాడు కాస్త చిరాకుగా.

ఆ రోజు రానేవచ్చింది. హనుమయ్య రెండు బలమైన గుర్రాలను పూన్చిన బండిలో లక్ష్మీప్రసన్నుణ్ణి ఎక్కించుకుని, ఊరవతల వున్న అడవిలో ప్రవేశించాడు. ఒక ఎత్తయిన గుట్టదగ్గిర బండిని ఆపి, ఇద్దరూ గుట్టఎక్కి, దిగువున వున్న చిన్న లోయలో దిగారు. అక్కడ రెండు బండల మధ్య వున్న ఖాళీస్థలంలోకి హనుమయ్య వెళ్ళి నిలబడుతూనే, తలపీక్కుంటూ, లక్ష్మీప్రసన్నుడి కేసి వెర్రిచూపులు చూడసాగాడు.



కొడుకు చెప్పిన సంగతి ఆమె హనుమయ్యకు చెప్పింది. అతడు కనుబొమలు చిట్లించి, ''అలాగా! అదేం నాకు గుర్తు లేదు,'' అనేశాడు.

ఈ జవాబుతో శ్రీమతికి, హనుమయ్య తమను మోసగించి, తన భర్త దాచిన సొత్తు ఎత్తుకుపోజూస్తున్నాడన్న గట్టి నమ్మకం కలిగింది.

ఆ మర్నాడు ఆమె, కొడుకుతో పాటు లోయలోకి వెళ్ళింది. ఈసారి హనుమయ్య బండలమధ్య వున్న ఖాళీప్రదేశంలో నిలబడి, జేవురించిన ముఖంతో వెర్రిగా అరుస్తూ, తల్లీ కొడుకులను కొట్టబోయేంత హంగామా చేశాడు.



అది చూసి లక్ష్మీప్రసన్నుడు భయపడిపోతూ, ''నీకేం జరిగింది, హనుమయ్యా? మనం యిక్కడికొచ్చింది, నాన్నగారు దాచిన సొత్తు తవ్వుకుపోవడానికిగదా,'' అన్నాడు.

''నాన్నగారు దాచిన సొత్తా! అసలు నువ్వెవడివి?'' అంటూ హనుమయ్య కళ్ళెర్రచేశాడు.

లక్ష్మీప్రసన్నుడు మరింతగా భయపడిపోయి, ఇంటికి పరిగెత్తి, జరిగింది తల్లికి చెప్పాడు.

అదివిని శ్రీమతి ఆశ్చర్యపోతున్నంతలో హనుమయ్య ఏమీ జరగనట్టే అక్కడికి వచ్చి, ఆమె ముందు నిలబడ్డాడు.

ఇది చూసి శ్రీమతికి భయంకన్న, ఆస్తిపోతుందన్న దుఃఖం కలిగింది. ఆ మరసటి రోజున ఆమె కొందరు పెద్దలను సాయంగా తీసుకుని హనుమయ్య వెంట లోయలోకి వెళ్ళింది. ఈసారి హనుమయ్య ఖాళీప్రదేశం చేరుతూనే, భక్తిగా నమస్కరించి, వెంటతెచ్చిన పలుగుతో అక్కడ తవ్వసాగాడు. తవ్విన కొద్దీ పెద్ద, పెద్ద రాగిబిందెలెన్నో బయటపడ్డాయి. వాటి నిండా అమూల్యమైన రత్నాలూ, వజ్రవైడూర్యాలూ, బంగారం కణికలు!

శ్రీమతికీ, లక్ష్మీప్రసన్నుడికీ కలిగిన ఆనందం అంతా యింతా కాదు. వాళ్ళ

వెంట వచ్చిన పెద్దలకు లోగడ హనుమయ్య, అలా ఎందుకు వింతగా ప్రవర్తించాడో అర్థం కాలేదు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, హనుమయ్య మనస్తత్వం ఎలాంటిదని, నువ్వు అభిప్రాయ పడుతున్నావు? అతడు ధనగుప్తుడి కుటుంబాన్ని మోసగించ వచ్చునని, చాలామందితో పాటు శ్రీమతి కూడా అనుకున్నది. ఇదంతా ఎరిగి కూడా హనుమయ్య రెండుసార్లు వింతగా ప్రవర్తించి, మూడవసారి దాచిన ధనాన్ని, శ్రీమతి పరం ఎందుకు చేసినట్టు? ధనం అపహరించేందుకు అతడికి ధైర్యం చాల లేదా? లేక, ఆత్మగౌరవం కోల్పోయి, పెంచి పెద్దచేసిన కుటుంబం పట్ల అతడికి బానిసప్రవర్తన అలవడిందా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "హనుమయ్యలో నీ వనుకునే లోపాలేమీ లేవు. పెంచిన యజమాని పట్లా, ఆయన కుటుంబం పట్లా భక్తి విశ్వాసాలు కలిగి వుండడం బానిసమనస్తత్వం అనిపించుకోదు. ధనగుప్తుడి రెండవభార్యా, కొడుకూ హనుమయ్య నిజాయితీ తెలిసిన వాళ్ళు కాదు. శ్రీమతి అతణ్ణి ధనం ఎక్కడ దాచిందీ చెప్పమని అడిగింది కూడా. అంటే, ఆమెకు, హనుమయ్య తన భర్త దాచిన ధనాన్ని అపహరించాడేమో అన్న శంక కలిగిందన్నమాట. ఆ సంగతి హనుమయ్య గ్రహించాడు. అటువంటి వాళ్ళు రేపు ధనగుప్తుడు దాచిన సొత్తు కొంత అతడు తస్కరించాడనే నిందవేసే అవకాశం కూడా వున్నది. అందుకే హనుమయ్య రెండుసార్లు పిచ్చివాడిలా ప్రవర్తించి, మూడవసారి నలుగురు పెద్ద మనుషుల ఎదుటా, దాచినసొత్తును తవ్వి బయిటికి తీశాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగంకలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# తాపత్రయం!

రంగయ్య అనే కట్టెలు కొట్టి జీవించేవాడొకడు, ఒకనాడు అడవిలో చాలా కట్టెలుకొట్టి, ఆయాన పడుతూ నిలబడ్డాడు. ఆ సమయంలో దారే పోతున్న సన్యాసి ఒకడు అతణ్ణి చూసి, "ఇన్ని కట్టెలు కొట్టడం ఎందుకు? అలా ఆయాసం పాలుకావడం దేనికి? కొద్దిగా కొట్టివుంటే, యీరోజు తిండి గడిచిపోయేది గదా," అన్నాడు.

రంగయ్య యింకా ఆయాసపడుతూనే, "ఈరోజు కొట్టిన కట్టెలవల్ల, నాకు మూడురోజులు తిండికి యిబ్బంది వుండదు. ఈ మూడు రోజులూ అడవికి రాకుండా హాయిగా విశ్రాంతి తీసుకుంటాను," అన్నాడు.

సన్యాసి జాలిపడుతున్నట్టు రంగయ్యకేసి చూస్తూ, "నాయనా, ఈ శరీరం మరో క్షణంలో ఏమవుతుందో, ఎవరికి తెలియదు గదా! అలాంటప్పుడు రేపు అనే దానికోసం అంత తాపత్రయం దేనికి?" అన్నాడు.

రంగయ్య చిరాకుపడుతూ, "నేను రేపటికి బతికి వుండకపోతే, ఏ గొడవా లేదు. ఒక వేళ బతికి వుంటే, అడవికి రావలసిన శ్రమ వుండదు, అవునా?" అన్నాడు.

సన్యాసి ఒక్క క్షణం నివ్వెరపోయి, "ఈపాటి లోకజ్ఞానం, తార్కికబుద్ధి మా గురువుకు కూడా లేవు," అని గొణుక్కుంటూ వెనుదిరిగి, వచ్చినదారి వెంటే వెళ్ళిపోయాడు.

—రాంబాబు





# తెలివిగలవాళ్ళు

ఉజ్బెకిస్థాన్‌లో ఒక పేదవాడికి ముగ్గురు కొడుకులుండేవాళ్ళు. తండ్రి వాళ్ళతో, ''అబ్బాయిలూ, మనకు పశువులమందలు లేవు, బంగారమూ లేదు. అందుచేత మీరు జ్ఞానధనం సంపాదించుకుని తెలివితేటలే ఆస్తిగా బతకవలసి వుంటుంది,'' అని బోధించాడు.

కొడుకులు తండ్రి చెప్పినట్టే జ్ఞానం సంపాదిస్తూ, ప్రతి విషయాన్నీ సూక్ష్మ బుద్ధితో గ్రహిస్తూ పెరిగి పెద్దవారయ్యారు. కొంతకాలానికి వారి తండ్రి గతించాడు. ఇక వారు ఉన్న ఊరు వదిలి బతుకు తెరువు వెతుక్కుంటూ బయలుదేరారు.

కొన్నాళ్ళపాటు నడిచిన మీదట వారి కొక నగరం అంతదూరాన కానవచ్చింది. ఆ నగరంలో తమకు ఏదో ఒక పని దొరకకపోదనుకుంటూ వారు నగరం కేసి నడిచారు.

దారి కేసి చూస్తూ తలవంచుకుని నడుస్తున్న పెద్దవాడు చప్పున ఆగి, ''కొద్ది సేపటికింద ఇటుగా ఒక భారీ ఒంటె వెళ్ళింది,'' అన్నాడు.

ముగ్గురూ నగరం కేసి కొద్ది దూరం నడిచాక, రెండోవాడు, ''దానికి ఒక కన్ను గుడ్డిది,'' అన్నాడు.

మరికొంతదూరం వెళ్ళాక, మూడోవాడు, ''దానిమీద ఒక ఆడదీ, ఒక బిడ్డా ఎక్కి ఉన్నారు,'' అన్నాడు.

వారు ఇంకా కొంతదూరం వెళ్ళినాక వారి వెనుకవైపు నుంచి ఒక మనిషి గుర్రం మీద వచ్చి వారిని కలుసుకున్నాడు.

పెద్దవాడు అతనితో, ''అయ్యా, దేని కోసమో వెతుకుతున్నట్టున్నావు. ఒంటె కోసం కాదుగదా?'' అన్నాడు.

''అవును, ఒంటె ఎటో పోయింది,'' అన్నాడు గుర్రమెక్కినవాడు.



"పెద్ద ఒంటె—అవునా?" అని పెద్ద వాడు మళ్ళీ అడిగాడు.

"అవును. మీరు చూశారా దాన్ని?" అని గుర్రమెక్కినవాడడిగాడు.

"దాని ఎడమకన్ను గుడ్డిది—అవునా?" అన్నాడు రెండోవాడు.

"దాని మీద ఒక స్త్రీ, ఒక బిడ్డా ఎక్కి ఉన్నారు కాదూ?" అని మూడోవాడడిగాడు.

"నిజం నిజం! మీరు దాన్ని చూశారన్నమాట!" అన్నాడు గుర్రమెక్కినవాడు.

"మేము నీ ఒంటెను చూడనేలేదు," అన్నారు అన్నదమ్ములు.

ఒంటెను పోగొట్టుకున్నవాడికి వాళ్ళపైన గట్టి అనుమానం తగిలింది. "నా ఒంటెనూ, దానిమీద ఉన్న నా భార్యనూ, కొడుకునూ ఏం చేశారో చెప్పకపోతే మిమ్మల్ని పాదుషా దగ్గిరికి ఈడ్చుకుపోతాను," అన్నాడతను.

"మేము నీ ఒంటెనుగానీ, నీ భార్యనుగానీ, నీ కొడుకునిగానీ కళ్ళ చూడలేదు. కాని ఈ దిక్కుగా వెళ్ళితే మాత్రం నీకు నీ ఒంటె దొరకవచ్చు," అన్నారు అన్నదమ్ములు.

"మీరు కళ్ళ చూడని ఒంటెనూ, దాని మీద ఉన్నవారినీ ఎట్లా వర్ణించారు? పాదుషా దగ్గిరికి పదండి!" అంటూ గుర్రమెక్కినవాడు, వారిని పాదుషా దగ్గిరికి తీసుకు పోయి, వారు తన ఒంటెనూ, భార్యనూ, కొడుకునూ తస్కరించినట్టు ఫిర్యాదు చేశాడు.

"వాళ్ళు తస్కరించారనటానికి అధారమేమిటి?" అని పాదుషా అడిగాడు.

"నా ఒంటె పెద్దదనీ, దానికి ఒక కన్ను గుడ్డిదనీ, దాని మీద ఒక స్త్రీ, ఒక బిడ్డా ఉన్నారనీ వీళ్ళు చెప్పారు. ఆ తరువాత ఏమీ చూడనేలేదన్నారు. ఏమీ చూడని వాళ్ళు ఈ వివరాలన్నీ ఎలా చెప్పారు?" అన్నాడు ఒంటెను పోగొట్టుకున్నవాడు.

"ఆ ప్రశ్నకేం చెబుతారు?" అని పాదుషా అన్నదమ్ముల నడిగాడు.

"మేము మా కళ్ళను ఉపయోగించి ప్రతిదీ సూక్ష్మంగా పరిశీలించి అనేక విషయాలు తెలుసుకోగలం," అన్నారు అన్నదమ్ములు.

"మీ విద్యను నేనిప్పుడే పరీక్షిస్తాను," అన్నాడు పాదుషా. ఆయన తన వజీరు చెవిలో ఏదో రహస్యంగా చెప్పాడు. వజీరు ఇద్దరు నౌకర్లచేత ఒక పెట్టె మోయించి తెచ్చి, పాదుషా కెదురుగా పెట్టించాడు.

"ఆ పెట్టెలో ఏమున్నదో చెప్పండి?" అని పాదుషా అన్నదమ్ములను ఆజ్ఞాపించాడు.

"అది ఖాళీ పెట్టె. అందులో ఒక గుండ్రని వస్తువు మాత్రమే ఉన్నది," అని పెద్దవాడు అన్నాడు.

"ఆ గుండ్రని వస్తువు దానిమ్మకాయ," అన్నాడు రెండోవాడు.

"పండని దానిమ్మకాయ!" అన్నాడు మూడోవాడు. పాదుషా తన ఆసనం నుంచి దిగి వచ్చి పెట్టె మూత తెరిచి అందులో నుంచి ఒక పచ్చి దానిమ్మకాయ పైకి తీశాడు. సభలోవారంతా నిర్ఘాంతపోయారు.

"వీళ్ళు దొంగలు కారు! నిస్సందేహంగా మహా మేధావులు! నీ ఒంటె ఏమైపోయిందో నీవే వెళ్ళి వెతుక్కో" అని పాదుషా ఫిర్యాదితో చెప్పి, అన్నదమ్ములను తనతోపాటు భోజనానికి



తీసుకుపోయి, దివ్యమైన భోజనం, పానీయాలు తాగించాడు.

"మీ తెలివి తేటలు నిజంగా అద్భుతంగా ఉన్నాయి. మీరు చూడని ఒంటెనూ, దాని మీద ఎక్కిన వారినీ ఎలా వర్ణించగలిగారు" అన్నాడు పాదుషా.

"దారిలో ఒంటె అడుగు జాడలున్నాయి. అవి మామూలు ఒంటెల గుర్తుల కన్న బాగా పెద్దవి. అందుకని అటుగా వెళ్ళినది భారీ అయిన ఒంటె అని తెలిసింది," అన్నాడు పెద్దవాడు.

"అది దారినపోతూ, కుడి పక్కన ఉన్న గడ్డినే కొరికింది గాని ఎడమ పక్కన ఉన్న గడ్డిని ముట్టుకోలేదు.




# సలహాల కాపురం

హరిపురంలో వుండే ధనరాజుకు, గుణమణితో వివాహం జరిగింది. ఒక్కడే కొడుకైన ధనరాజు, తల్లిదండ్రుల పెంపకంలో ఎక్కడలేని భయభక్తులతో పెరిగాడు.

కొత్తకాపురం కనక, వచ్చిన కొద్ది రోజులకే గుణమణికి చీరలు కావలసి వచ్చింది. ఆ విషయం ఆమె భర్తతో చెప్పింది.

"ఏ రకంవి, ఎన్ని కొనమంటుందో అమ్మను అడిగి కొంటాను," అన్నాడు ధనరాజు.

ఆ మర్నాడు తల్లి వేణమ్మ సలహా ప్రకారం నిత్యం కట్టుకునేందుకు నాలుగు చీరలు కొని తెచ్చి, భార్యకిచ్చాడు.

వారం రోజుల తరవాత పొరుగూరిలో వున్న ధనరాజు స్నేహితుడికి వివాహం జరగబోతున్నట్టు వార్త అందింది. గుణమణి ధనరాజుకు, స్నేహితుడికి ఏదైనా బహుమానం తీసుకుపోయి యివ్వడం బావుంటుందని సూచించింది.

"మా నాన్నను కనుక్కుంటాను. ఆయన ఏది బహుమానంగా తీసుకుపొమ్మంటే, అది తీసుకుపోయి యిచ్చి వస్తాను," అన్నాడు ధనరాజు.

ధనరాజు స్నేహితుడి పెళ్ళికి వెళ్ళి వచ్చాక, ఒక రోజున గుణమణి అతడితో, "మా అమ్మా వాళ్ళను చూసి చాలా కాలమైందండీ! ఒకసారి పుట్టింటికి వెళ్ళి రావాలని వుంది," అన్నది.

"నిన్ను ఎప్పుడు వెళ్ళమంటుందో, పుట్టింట ఎన్ని రోజులుండి తిరిగి రమ్మంటుందో అంతా అమ్మనడిగి చెబుతాను," అన్నాడు ధనరాజు.

ఆ తరవాత గుణమణిని తల్లి సలహా ప్రకారం పుట్టింటికి పంపించాడు. కొన్ని రోజుల తరవాత ఆమెను అత్తవారింట

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి



# నవకోటి నారాయుడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే టప్పుడు ఒక మహా ధనికు డుండేవాడు. ఆయన తొమ్మిదవ కోటి పూర్తిచేసి, పడగ ఎత్తే సమయానికి ఒక కొడుకు పుట్టాడు. అందుచేత కొడుక్కు ఆప్యాయంగా, నవ కోటి నారాయుడు అని పేరు పెట్టాడు.

నారాయుడికి తండ్రి లేదనకుండా కోరిన కోరికలన్నీ తీర్చేవాడు. అందుచేత కుర్రవాడు ఆడింది ఆట, పాడింది పాట అయింది. అతడు దుష్టులతోను, దుండ గీళ్ళతోను సహవాసం చేయసాగాడు.

ఏమైతేనేం, యుక్తవయసు వచ్చేసరికి తండ్రి ఒక చక్కటి పిల్లను చూసి నారాయుడికి అతి వైభవంగా పెళ్ళి జరి పించాడు. మరి కొద్దికాలానికే ఆయన కాలం చేశాడు.

చిన్నప్పటి నుంచీ నారాయుడు హద్దూ పద్దూ లేకుండా చేస్తూ వచ్చిన బాకీలన్నీ తడిసి మోపెడై, తండ్రి పోయేసరికి, కాల సర్పాలలాగ వచ్చి పట్టుకున్నాయి. ఋణ దాతలందరూ ఒక్కసారిగా వచ్చి చుట్టు కున్నారు. ఈ స్థితిలో నారాయుడికి జీవిత మంటే నిస్పృహ తోచింది. గత్యంతరం కానక, చివరకు చస్తే మేలనిపించింది. ఏమీ బదులు చెప్పలేక, నారాయుడు వారితో, "అయ్యా! నేను గంగ ఒడ్డున ఫలానా రావిచెట్టు కింద ఉంటాను. అక్కడ మా పూర్వులు వదిలి వెళ్ళిన నిక్షేపమున్నది. మీ మీ పత్రాలన్నీ పట్టు కుని అక్కడకు రండి," అని చెప్పాడు.

అవుననుకొని అందరూ ఆ రావిచెట్టు వద్దకువెళ్ళి సిద్ధంగా వున్నారు. నారాయుడు నిక్షేపం కోసం వెతుకులాడుతున్నట్టు నడిరాత్రి వరకు అటు యిటు తచ్చాడి, వాళ్ళు ఆదమరపుగా వుండటం చూసి, గభీమని గంగలోకి దుమికేశాడు. 'జయ్



పరమేశ్వరా!' అని అతడు జాలిగా కేక వేసేంతలో ప్రవాహవేగం అతణ్ణి ఎంత దూరమో లాక్కుపోయింది.

ఆ కాలమందు బోధిసత్వుడు ఒక లేడిగా జన్మించి, తక్కిన లేళ్ళ మందలకు దూరంగా, గంగా తీరాన, లతలు పొదలు అల్లుకున్న ఒక మామిడి తోటలో నివాసం ఏర్పరచుకున్నాడు. ఈ లేడి అన్నివిధాలా ప్రత్యేకత కలది—బంగారు శరీరచ్ఛాయ, లక్కవంటి కాళ్ళడెక్కలు, వెండికొమ్ములు, రత్నపుపాదలలాగా జిగజిగ మెరిసే చక్కటి కన్నులు—ఇటువంటి అపూర్వ సౌందర్యంతో ప్రకాశిస్తున్నది లేడి.

ఈ లేడికి అర్ధరాత్రి సమయాన విపత్తులో వున్న ఒక మానవుని ఆక్రందనం వినిపించింది. ''ఏమిటీ దీనాలాపం!'' అనుకొంటూ, బంగారు లేడి లేచి, ఎదురీదిపోయి నారాయుడి వద్దకు చేరుకొన్నది.

"నీకు వచ్చిన భయంలేదు, నాయనా!" అంటూ అది వానికి ధైర్యం చెప్పి, వీపుపైన ఎక్కించుకొని బసకు తీసుకుపోయింది. అతడు తేరుకొనే వరకూ ఆ లేడి అరణ్యంలో నించి ఫలాదులు తెచ్చి, నారాయుడికి ఆకలి దప్పులు తీర్చింది.

తరువాత ఒకరోజున, ''నాయనా! నిన్ను ఈ అరణ్యం దాటించి మీ రాజ్యానికి దోవ చూపిస్తాను. క్షేమంగా వెళ్ళిపో. అయితే ఒకే ఒక్క కోరిక — రాజుగాని మరే శ్రీమంతుడుగాని నిన్ను ఎంతగా ఆకర్షించినప్పటికీ, ఫలానిచోట బంగారు లేడి వున్నది అనే సంగతిమట్టుకు వెల్లడించవద్దు. ఇదే నా కోరిక," అని చెప్పింది.

సరేనన్నాడు నారాయుడు. ఈ వాగ్దానం నమ్మి, బంగారు లేడి వాడిని తన వీపు పైన ఎక్కించుకొని కాశీరాజ్యానికి పోయే బాట మీద వదిలి పెట్టింది.

సరీగా నారాయుడు కాశీపట్టణం చేరుకొన్న రోజునే ఒక చిత్రం జరిగింది. అంతకు క్రితం పట్టపురాణికి కలలో ఒక సుంధరమైన బంగారు లేడి కనిపించి,

ధర్మబోధ చేసిందట. రాణి తన భర్త వద్దకు వచ్చి, "అసలు లోకంలో ఉండక పోయినట్టయితే ఇటువంటి లేడిరూపం నా కెందుకు కనబడుతుంది? దాన్ని వెంటనే నాకు పట్టి తెస్తేనే తప్ప, జీవాలు నిలవవు," అంటూ పట్టు పట్టింది.

తక్షణమే రాజు చేసిన ఏర్పాటు ఏమంటే: ఒక ఏనుగు మీద అంబారీ, అంబారీలో బంగారు బరిణె, బరిణె లోపల వెయ్యి మొహిరీలు—వీటితో అది ఊరేగుతుంది. బంగారు లేడిని గురించిన భోగట్టా తెలిపే వారికి బరిణెలోని మొహిరీలను బహుమతిగా ఇస్తారు.

ఈ విధమైన ఒక ప్రకటన స్వర్ణపత్రం మీద లిఖింపించి, సేనాని ఊరూరా దండోరా వేయించాడు. సరిగా ఈ దండోరా వేసే సమయానికే నారాయుడు కాశీనగరంలో అడుగు పెట్టాడు.

అతడు సేనాని వద్దకువచ్చి, "అయ్యా, మీకు కావలసిన ఆ బంగారు లేడిని గురించి నా కంతా తెలుసు. నన్ను ప్రభువు దగ్గరకు తీసుకపొండి," అన్నాడు.

తరవాత నారాయుడు రాజునూ, పరివారాన్నీ వెంట బెట్టుకుపోయి, అరణ్య మధ్యంలో బంగారు లేడి నివసించే ఏకాంత స్థలం చూపించి, తను అల్లంత దూరాన నిలబడ్డాడు.

రాజుగారి పరివారం ఒక్కసారిగా గొల్లుమని కేకవేశారు. లేడి రూపంలో వున్న బోధిసత్వుడు ఆ శబ్దం విన్నాడు.



"ఎవరో గొప్ప అతిథి వచ్చి వుండాలె. స్వాగతమిద్దాం," అనుకుంటూ అతడు లేచి, రాజు నిలబడ్డచోటికి పోబొయ్యాడు.

లేడి యొక్క వేగానికి రాజు ఆశ్చర్య పోయాడు. విల్లమ్ములు తీసుకొని, లేడికి ఎక్కు పెట్టాడు. అప్పుడు లేడి ఇలా అన్నది: "రాజా! ఆగు, తొందరపడకు. నా ఉనికిని గురించి నీకు చెప్పినవారెవరు?"

రాజు చెవులకు ఈ మాటలు అమృత తుల్యంగా వినబడినై. ఆయనకు తెలియకుండానే విల్లమ్ములు కిందపడినై.

నిదానమైన మధుర స్వరంతో బోధి సత్త్వుడు, "రాజా! నా ఉనికిని నీకు తెలిపిన దెవరు?" అని మళ్ళీ ప్రశ్నించాడు. రాజు నారాయుడిని వేలు ఎత్తి ఆనవాలు చూపించాడు.

అప్పుడు బోధిసత్త్వుడు ఇలా ధర్మం చెప్పాడు: "లోకంలో మానవుని మించిన కృతఘ్నుడు లేడని శాస్త్రాలు చెప్పిన మాట నిజం. జంతుభాష తెలుసుకోవచ్చు, పక్షి భాష తెలుసుకోవచ్చు. కాని మనిషి మాట అర్థం చేసుకోవడం బ్రహ్మతరం కాదు," అంటూ తను నారాయుడిని రక్షించి, అతని వద్ద నుంచి వాగ్దానం తీసుకొన్న వృత్తాంతమంతా రాజుకు వివరించాడు.

రాజు ఉగ్రుడై, "ఇదా సమాచారం! ఇటువంటి కృతఘ్నుడు, మహాపాపి లోకానికి పీడ. ఒక్క బాణంతో వీణ్ణి హతమారుస్తాను," అని బాణం తీశాడు.

బోధిసత్త్వుడు ఆయనను వారించి, "రాజా! చంపవద్దు. ప్రాణం తీస్తే ఏముంది? బ్రతికివుంటే ఏనాటికైనా వాడికే బుద్ధి వచ్చి బాగుపడతాడు. నీ వాగ్దానం ప్రకారం వాడికీయవలసిన బహుమతులు కూడా ఇచ్చివెయ్యి. ఇదే న్యాయం," అని హితబోధ చేశాడు. అలానే చేశాడు రాజు.

బోధిసత్త్వునిలోని ఔదార్యమూ, క్షమా మొదలైన మహత్తర గుణాలన్నీ అప్పుడు బోధపడినై రాజుకు. బోధిసత్త్వుడు మహానుభావుడని గుర్తించి, ఆయనను తన రాజ్యం నడిపించే సారథిగా ఎంచుకొన్నాడు.





# శ్రీ చైతన్యప్రభువు

ఒరిస్సా ప్రాంతంలోని జయపూర్ నుంచి నవద్వీప మాయాపురికి వచ్చి స్థిరపడిన మిశ్రాపండితకుటుంబం అంటే ఆ చుట్టుపట్ల వారికి చాలా గౌరవాదరాలు వుండేవి. 1486వ సంవత్సరం ఫిబ్రవరి పద్దెనిమిదవ తేదీన జగన్నాథమిశ్రా, శోచీదేవి దంపతులకు ఒక కుమారుడు పుట్టాడు.

తల్లిదండ్రులు నిమాయ్ అని నామకరణం చేసిన ఆ బిడ్డ శరీరఛ్ఛాయ కాంతివంతంగా వుండడంవల్ల అతణ్ణి గౌరాంగుడు అని కూడా పిలిచేవారు. చదువు సంధ్యలలోనూ, ఆట పాటలలోనూ తోటి బాలలందరిలో మిన్నగా వుండేవాడు గౌరాంగుడు.





నిమాయ్ యువకుడుగా వున్నప్పుడే ఒక సంస్కృత పాఠశాలను నెలకొల్పి ఉపాధ్యాయు డయ్యాడు. ఆయన పాండిత్యం, దయాగుణం విద్యార్థులను ఎంతగానో ఆకర్షించేవి. కాని ఉన్నట్టుండి ఒకరోజు నిమాయ్ గయకు వెళ్ళి, ఈశ్వర్‌పూరీ అనే సాధుపుంగవుని దర్శించి, అతడి శిష్యుడయ్యాడు.



నిమాయ్ మాయాపురికి తిరిగి వచ్చిన తర్వాత సంస్కృత పాఠశాలను మూసి వేశాడు. నిరంతరం ధ్యానంలోనూ, భక్తిశ్రద్ధలతో శ్రీకృష్ణకీర్తనలు గానం చేయడంలోనూ, కాలం గడపసాగాడు. అచిరకాలంలోనే ఆయనకు చాలా మంది అనుచరులు ఏర్పడ్డారు. వారు బృందాలుగా చేరి భజనకీర్తనలు ఆలాపిస్తూ ఊరేగింపులు జరపడం ప్రారంభించారు.

సంప్రదాయవాదులు కొందరికి ఈ పాటలు పాడే నూతన వైష్ణవుల పద్ధతి నచ్చలేదు. అందువల్ల, వారు బెంగాల్ నవాబు స్థానిక ప్రతినిధియైన కాజీ దగ్గరకు వెళ్ళి, నిమాయ్ అనుచరులు చేసే శ్రీకృష్ణకీర్తనలకు వ్యతిరేకంగా ఫిర్యాదు చేశారు.





వీధుల్లో బృందగానాలు చేయడం నిషేధిస్తూ ఆజ్ఞలు జారీచేశాడు కాజీ. అయినా నవ ద్వీపంలో వున్న వారందరికీ తన భజనల్లో పాల్గొనమని పిలుపునిచ్చాడు నిమాయ్. కొందరు భయపడి, దాని దుష్ఫలితాలను గురించి ఆయన్ను హెచ్చరించారు. కాని, కాజీ మీద కోపంతో కాకుండా, దేవుని మీద తన కున్న అచంచలమైన భక్తి కారణంగా, కాజీ నిషేధాజ్ఞలను అతిక్రమించడానికే నిశ్చయించాడు నిమాయ్.



వందలాదిమంది భక్తులు నిమాయ్ చుట్టూ చేరారు. శ్రీకృష్ణలీలలను అభివర్ణించే భక్తి గీతాలను నోరారా పాడుకుంటూ భజనబృందం బయలుదేరింది. పోను పోను భక్తుల సంఖ్య పెరిగి, పెరిగి ప్రజానముద్రంలాగా తయారయింది. భజనబృందం కాజీ గృహాన్ని సమీపించగానే, దాన్ని చూపిన కాజీ వెలుపలికి వచ్చి భక్తి పూర్వకంగా నిమాయ్‌కి నమస్కరించాడు!

ఒకసారి నిమాయ్ ప్రథమ శిష్యుడైన నిత్యానందుడి మీద జగాయ్, మధాయ్ అనే ఇద్దరు దుష్టులు చేయి చేసుకున్నారు. మధుపాత్రను ఆయన మీదకు విసిరారు. నిత్యానందుడి శరీరం నుంచి రక్తం స్రవించసాగింది. అయినా అతడు ఏ మాత్రం కోప్పడకుండా, కృష్ణనామాన్ని చెప్పమని వారికి బోధించసాగాడు. ఇంతలో అక్కడికి నిమాయ్ రావడంతో, వాళ్ళు అతని పాదాలపై పడి నమస్కరించారు.





నిమాయ్‌కి విష్ణుప్రియతో వివాహమయింది. కొన్నాళ్ళపాటు, మామూలు జీవితం గడిపిన తర్వాత, నూతన జీవనం గడపడానికి సమయం ఆసన్నమయినట్లు ఆయన గ్రహించాడు. ఒకనాడు రాత్రి ఇల్లు వదిలి సుప్రసిద్ధుడైన కేశవభారతిని సందర్శించి, సన్యాసం స్వీకరించాడు. నాటినుంచి ఆయన కృష్ణచైతన్యుడుగా పేరు గాంచాడు.

విశ్వాసపాత్రులైన అనుచరులతో ఆయన పవిత్ర పూరీనగరానికి ప్రయాణమయ్యాడు. దూరం నుంచి పూరీ క్షేత్రాన్ని దర్శించగానే ఆయన ఎంతో తన్మయత్వం చెందాడు. కవులా, పండితులా, సాధుపుంగవుల సాన్నిధ్యంలో అక్కడే స్థిరపడాలని నిశ్చయించాడు.





కృష్ణ నివాసస్థానంగా పురాణప్రసిద్ధిగాంచిన బృందావనానికి యాత్ర చేశాడు చైతన్యుడు. అక్కడ శ్రీకృష్ణని లీలలతో సంబంధం వున్న స్థలాలను గుర్తించాడు. ఆయన అభీష్టం మేరకు ఆ ప్రదేశాలలో నూతన ఆలయాలు నిర్మించబడ్డాయి. ప్రాచీన ఆలయాలు పునరుద్ధరించబడ్డాయి.

కృష్ణచైతన్య, పూరీకి తిరిగి వచ్చినప్పుడు, ఒరిస్సా రాజు ప్రతాపరుద్రుడూ, మంత్రి రామానందరాయ్, భక్తిశ్రద్ధలతో ఘనంగా స్వాగతం పలికారు. 1553వ సంవత్సరంలో ఆయన అజ్ఞాతంగా ఎక్కడికో వెళ్ళిపోయాడు. కాని ఆయన నడిపిన వైష్ణవ ఉద్యమం మాత్రం తూర్పు భారతదేశాన్ని ప్రత్యక్షంగానూ, మిగతా ప్రాంతాలను పరోక్షంగానూ ప్రభావితం చేసింది.






హరిపురంలో వుండే ధనరాజుకు, గుణమణితో వివాహం జరిగింది. ఒక్కడే కొడుకైన ధనరాజు, తల్లిదండ్రుల పెంపకంలో ఎక్కడలేని భయభక్తులతో పెరిగాడు.

కొత్తకాపురం కనక, వచ్చిన కొద్ది రోజులకే గుణమణికి చీరలు కావలసి వచ్చింది. ఆ విషయం ఆమె భర్తతో చెప్పింది.

"ఏ రకంవి, ఎన్ని కొనమంటుందో అమ్మను అడిగి కొంటాను," అన్నాడు ధనరాజు.

ఆ మర్నాడు తల్లి వేణమ్మ సలహా ప్రకారం నిత్యం కట్టుకునేందుకు నాలుగు చీరలు కొని తెచ్చి, భార్యకిచ్చాడు.

వారం రోజుల తరవాత పొరుగూరిలో వున్న ధనరాజు స్నేహితుడికి వివాహం జరగబోతున్నట్టు వార్త అందింది. గుణమణి ధనరాజుకు, స్నేహితుడికి ఏదైనా బహుమానం తీసుకుపోయి యివ్వడం బావుంటుందని సూచించింది.

"మా నాన్నను కనుక్కుంటాను. ఆయన ఏది బహుమానంగా తీసుకుపొమ్మంటే, అది తీసుకుపోయి యిచ్చి వస్తాను," అన్నాడు ధనరాజు.

ధనరాజు స్నేహితుడి పెళ్ళికి వెళ్ళి వచ్చాక, ఒక రోజున గుణమణి అతడితో, "మా అమ్మా వాళ్ళను చూసి చాలా కాలమైందండీ! ఒకసారి పుట్టింటికి వెళ్ళి రావాలని వుంది," అన్నది.

"నిన్ను ఎప్పుడు వెళ్ళమంటుందో, పుట్టింట ఎన్ని రోజులుండి తిరిగి రమ్మంటుందో అంతా అమ్మనడిగి చెబుతాను," అన్నాడు ధనరాజు.

ఆ తరవాత గుణమణిని తల్లి సలహా ప్రకారం పుట్టింటికి పంపించాడు. కొన్ని రోజుల తరవాత ఆమెను అత్తవారింట

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి



దిగబెట్టేందుకు, ఆమె అన్న ఆనందం వెంట వచ్చాడు.

ఒక రోజున అతడూ, ధనరాజు తండ్రి రామనాథం వీధి అరుగు మీద కూర్చుని ఏదో మాట్లాడుకుంటూండగా, ధనరాజు చేతిలో ఒక సంచి పట్టుకుని అక్కడకి వచ్చి, ''బజారుకు వెళ్ళొస్తాను, నాన్నా!'' అన్నాడు.

''అలాగే వెళ్ళి, రా!'' అన్నాడు రామనాథం కొంచెం విసుగ్గా.

''బావ, మీ సలహా, అత్తయ్య సలహా అనుమతుల్లాంటివి లేందే, ఎంత చిన్న పనీ చేయడు లా వుంది,'' అన్నాడు ఆనందం చిన్నగా నవ్వి.

''అవును, వాణ్ణిలా పెంచుకు వచ్చాం!'' అని, రామనాథం కొంచెం సేపు ఆలోచిస్తూ వూరుకుని, ''మరి, మా కోడలిమాటా, నీ మాటా ఏమిటి?'' అని అడిగాడు.

''మేం పెరిగినతీరు వేరు, ప్రతి స్వల్ప విషయానికీ మా నాన్నావాళ్ళను, సలహాలు అడగం,'' అన్నాడు ఆనందం.

ఆనందం మరి రెండు రోజులు వుండి వెళ్ళిపోగానే రామనాథం కొడుకుతో, ''నేనూ, మీ అమ్మా ఒక నెల రోజుల పాటు దక్షిణాదిన పుణ్యక్షేత్రాలు దర్శించేందుకు పోతున్నాం. మా ప్రయాణం, రేపే!'' అన్నాడు.

ఆ మాట వింటూనే ధనరాజు బెంబేలు పడిపోతూ, ''నెల రోజులా! ఈ లోపల నాకు పొలం పనులూ అవీ చేయించేందుకు సలహా యిచ్చేదెవరు?'' అన్నాడు.

రామనాథం జవాబివ్వ లేదు. తల్లీ దండ్రీ యాత్రలకు వెళ్ళిన నాలుగోరోజున ధనరాజు స్నేహితుడు భూపతి అతడి దగ్గిరకు వచ్చి, అవసరం వచ్చింది వెయ్యి రూపాయలు అప్పు కావాలన్నాడు.

ధనరాజు, గుణమణి దగ్గిరకుపోయి, ''ఇప్పుడేం చెయ్యడం? సలహా యిచ్చేందుకు నాన్న ఊళ్ళో లేడు. భూపతి వెయ్యి రూపాయలు అడుగుతున్నాడు,'' అన్నాడు.

'' అప్పు యిస్తే, మీ స్నేహితుడు తీర్చ గలడో లేదో, ఆ సంగతి మీరాలోచించుకో వాలి. ఇందులో మీ నాన్నగారి సలహా, నా సలహా ఎందుకు?'' అన్నది గుణమణి.

ఒక వారం రోజులు గడిచాక పాలేరు నూకాలు, ధనరాజు దగ్గిరకు వచ్చి, ''మనం చెరుకుతోట వెయ్యాలి. ఎన్ని మడులలో వేద్దామంటారు ?'' అన్నాడు.

''ఎంత పొలంలో చెరుకు వెయ్యాలో, నాన్న చెపితే నేను వేయించేవాడిని. ఇప్పుడేం చేయాలో తోచడం లేదు.'' అన్నాడు ధనరాజు భార్యతో.




''ఇందులో తోచకపోవడానికేముం దండీ ? మీరు రోజూ పొలం వెళ్ళి వస్తు న్నారు కదా. ఈ మధ్య తీసివేసిన మడిలో, యిప్పట్లో మళ్ళీ చెరుకు వెయ్యం గదా ! కొన్ని మడులు వరి సాగుకు వుంచాలి. పోతే, యింకెన్ని మడులు ఖాళీగా వుంటాయో మీకు తెలుసు,'' అన్నది గుణమణి తాపీగా.

రెండు రోజులు తిరక్కుండానే ధన రాజు తను ఆలోచించి నిర్ణయించిన ప్రకారం పొలంలో చెరుకు ఊడ్పులు పూర్తి చేయించాడు. తరవాత ఇతరత్రా పొలం పనులూ, ఇంటి అవసరాలను గురించి ధనరాజు అడిగినప్పుడల్లా, గుణ మణి, ''అవన్నీ మీకేం తెలియనివికావు, మధ్య నా సలహా లెందుకు ?'' అనడం ప్రారంభించింది.

ఈ లోపల తండ్రి రామనాథం నుంచి ధనరాజుకు, తాము మరి కొన్ని క్షేత్రాలు చూడబోతున్నామనీ, మరి రెండు నెలలకు గాని తిరిగిరామనీ కబురు వచ్చింది.

ఆ విధంగా ధనరాజు తన సొంత నిర్ణయాలతో పొలం బాధ్యతలూ, ఇంటి బాధ్యతలూ విజయవంతంగా నిర్వహిం చాడు. మూడు నెలల తర్వాత అతడి తల్లి దండ్రులు యాత్రలనుంచి తిరిగివచ్చారు.

ఈ సంగతి తెలిసి ఆనందం, వాళ్ళను పలకరించిపోయేందుకు వచ్చాడు. అవి గ్రామదేవతపండుగ ప్రారంభపు రోజులు.

అతడూ, రామనాథం, ధనరాజూ వాకిట్లో నిలబడి పొలం పనులను గురించి మాట్లాడుకుంటూండగా, పూజారి పోతు రాజు కొందరిని వెంటబెట్టుకుని వాళ్ళ దగ్గరకు వచ్చి, ''అయ్యా, అమ్మవారి జాతరగదా! తమరు బహుమానం యిప్పించాలి,'' అన్నాడు.

రామనాథం ఏదో అనబోయేంతలో ధనరాజు అందుకుని, ''అలాగే బహుమానం యిస్తాను. మీ పాటగాళ్ళూ, సాము గరిడీలు చేసేవాళ్ళూ, మా ఇంటిముందు కనీసం అరగంటయినా ఆగాలి,'' అని ఇంట్లోకి పోయి కొంత డబ్బు తెచ్చి పోతు రాజుకు ఇచ్చాడు.

ఇది చూసి రామనాథం చాలా సంతోషించాడు. ఆనందం తన బావమరిదిలో వచ్చిన యింత పెద్ద మార్పుకు ఆశ్చర్య పోయాడు. అంతలో పాలేరు నూకాలు అటుగా రావడం చూసి, వాడికి ఏదో చెప్పడానికి ధనరాజు అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

తన కొడుకుకేసి ఆశ్చర్యంగా చూస్తున్న ఆనందంతో, రామనాథం, ''ఆరోజున నీతో మాట్లాడిన తరవాత బాగా ఆలోచించి కావాలనే నేనూ, మీ అత్తయ్యా తీర్థయాత్రలకు బయలు దేరాం. ఈ వయసులో కూడా మా వాడు ఎంత చిన్న పనీ స్వతంత్రించి చెయ్యలేక పోవడానికి కారణం, మా పెంపకంలోని లోపమని గ్రహించడానికి నాకు చాలా కాలం పట్టింది!'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

''అంతేనంటారా?'' అన్నాడు ఆనందం, ఏమనడానికీ తోచక.

''అంతేమరి! రెక్కలొచ్చి ఎగరడానికి సిద్ధంగా వున్న తమ పిల్లల్ని గూటిలోనే వుంచి, ఆహారం తెచ్చి పెట్టడం ప్రారంభిస్తే, జరిగేదేమిటి? పిల్లలు తమకు ఎగిరే శక్తి వున్నదనే సంగతే గుర్తించలేవు. మావాడి విషయంలో కూడా అంతే జరిగింది! ఏమైతేనేం, మావాడి సలహాల కాపురం చక్కబడింది!'' అన్నాడు రామనాథం.



# చెడ్డవార్త!

సీతయ్య చాలా బద్ధకం మనిషి. అతడు సోమిశెట్టి దుకాణంలో పని చేస్తూండేవాడు. అతడి తండ్రి చనిపోయేనాటి వరకూ ఎంతో విశ్వాసంగా పని చెయ్యడంతో, సోమిశెట్టి, సీతయ్య బద్ధకాన్నీ, సోమరితనాన్నీ అంతగా పట్టించుకునేవాడు కాదు.

ఒకనాడు పట్నం నుంచి బండిలో సరుకులు తెస్తూండగా, బండి బోల్తా పడడంతో సీతయ్యకు బాగా దెబ్బలు తగిలాయి. అతణ్ణి బండి తోలేవాడు భద్రంగా యింటికి చేర్చాడు. వైద్యుడు అనంతాచార్లు వచ్చి గాయాలకు కట్లు కట్టి వెళ్ళాడు. సోమిశెట్టి కూడా సీతయ్యను స్వయంగా చూడవచ్చి, "ప్రాణాలతో బయట పడ్డావు; అదే పదివేలు. గాయాలు పూర్తిగా నయమయ్యే దాకా పనిలోకి రాకు. జీతం డబ్బుల్లో కోత పెట్టనులే," అన్నాడు.

లోగడ సీతయ్య సోమరితనం చూసి కసురుకునే భార్య అతడికి శ్రద్ధగా సేవ చేయ సాగింది. బంధువులు పరామర్శించడానికి వచ్చినప్పుడు పళ్ళూ, కూరగాయలూ యిచ్చి పోసాగారు.

పది రోజులు గడిచాక అనంతాచార్లు వచ్చి సీతయ్య కట్లు విప్పి, పరీక్ష చేసి, జాలి పడుతూ, "సీతయ్యా, నీకు చెడ్డవార్త చెప్పవలసి వచ్చినందుకు బాధగా వున్నది. నీ కీళ్ళు బాగా దెబ్బతిన్నాయి... "

సీతయ్యా, ఆచారుల్ని ఆగమన్నట్టు చేయి వూపి, "అదేదో చెడ్డవార్త చెపుతానని, చెప్పకుండానే వెళ్ళిపోతున్నారు!" అన్నాడు.

ఆచార్లు ఆ ప్రశ్న విని ఆశ్చర్యపోతూ, ఉన్నచోటునే నిలబడిపోయాడు.

—జొన్నలగడ్డ రత్న





# ఒకే రకం!

తెల్లవారుతూనే వంటపని ప్రారంభించిన చైతన్య, వీధిలో ఏదోకలకలం విని, వాకిటి దగ్గిరకు వచ్చాడు. ఎదురుగా ఒక గుర్రపు బండి ఆగివున్నది. దానిచుట్టూ పదిమంది మనుషులు మూగి వున్నారు.

చైతన్య గబగబా వెళ్ళి బండిలోకి తొంగి చూశాడు. లోపల ఒక యాభైఏళ్ళ పెద్ద మనిషి, విపరీతమైన గుండెనొప్పితో మెలికలు తిరిగిపోతున్నాడు.

ఆయనది పొరుగూరని తెలుసుకున్న నలుగురూ, బండి వాడితో, "మనిషి ప్రాణం దక్కేలాలేదు. వెంటనే వాళ్ళ ఊరు తీసుకుపో," అన్నారు.

బండివాడు గుర్రాన్ని అదిలించబోయేంతలో చైతన్య అడ్డుపడి, "గుండెపోటు వచ్చినప్పుడు ప్రయాణం పనికిరాదు. విశ్రాంతి అవసరం. ఈయన్ని మా ఇంట్లోకి తీసుకువెళతాను," అని బండి వాడి సాయంతో స్పృహలేని అతణ్ణి ఇంట్లోకి తెచ్చి, పక్కసర్ది పడుకోబెట్టాడు.

తరవాత చైతన్య బండివాణ్ణి వైద్యుడి కోసం పంపాడు. వైద్యుడు వచ్చి, ఏవో మందులిచ్చి ఫరవాలేదని చెప్పి వెళ్ళిపోయాడు.

చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న చైతన్య, బంధువుల సాయంతో చదువుకుని; ఆ ఊళ్లో ఉద్యోగం సంపాయించాడు. సొంతాన ఇంటెడు పనీ చేసుకుని, కచేరీకి వెళ్ళేముందు వంట పని ఆరంభిస్తాడు.

చైతన్య పని పూర్తిచేసుకుని వచ్చేసరికి గుండెపోటుతో బాధపడుతున్న రోగికి బాగా స్పృహ తెలిసింది. ఆయన తానున్న కొత్త ప్రదేశం చూసి ఆశ్చర్యపోతూ, చప్పున మంచంమీద లేచి కూర్చుని, "నేనెక్కడున్నాను?" అన్నాడు.

మాచిరాజు కామేశ్వరరావు



చైతన్య ఆయనకు జరిగింది చెప్పి, ''ఇప్పుడు ఒంట్లో బాగున్నదిగదా ?'' అని అడిగాడు.

ఆయన చైతన్య కేసి ఆప్యాయంగా చూస్తూ, ''నా పేరు రామభద్రయ్య. సమయానికి ఆదుకుని, నా ప్రాణం కాపాడావు. నేను గుండెజబ్బు మనిషిని. నీ సహాయం యీ జన్మలో మరవలేను!'' అన్నాడు.

తరవాత చైతన్య, రామభద్రయ్యకు స్నానం ఏర్పాట్లు చేశాడు. ఆయన స్నానం చేసి వచ్చాక, వేడివేడిగా భోజనం వడ్డించాడు. ఆవంట చేసింది చైతన్య అని తెలుసుకుని రామభద్రయ్య, ''వంట అద్భుతంగా వున్నది. తింటూంటే, మా ఇంట్లోనే భోజనం చేస్తున్నానేమో అనిపిస్తున్నది,'' అన్నాడు.

రామభద్రయ్య ఆ పూటే తన ఊరు బయలుదేరి వెళతానన్నాడు. జబ్బు మనిషిని ఒంటరిగా పంపడం బావుండదనుకుని, చైతన్య కచేరీకి సెలవు పెట్టి, బండిలో ఆయన వెంట బయలుదేరాడు.

ఊరు చేరేసరికి సాయంత్రమయింది. రామభద్రయ్య, చైతన్యను తన భార్యకూ కొడుకూ, కూతుళ్ళకు పరిచయం చేసి, చైతన్య చేసిన సాయంగురించి చెప్పాడు. అందరూ అతడికి తమ కృతజ్ఞతలు చెప్పుకుని, ఆ రాత్రికి తమ ఇంట వుండి, తెల్లవారాక వెళ్ళవలసిందిగా కోరారు. చైతన్య సరేనన్నాడు.

రామభద్రయ్య కొడుకు చైతన్యకు ఊరు చూపించేందుకు తీసుకువెళ్ళాడు. రామభద్రయ్య తన భార్యతో, ''కుర్రవాడు చాలా బుద్ధిమంతుడు, మన అమ్మాయికి యింతకంటె మంచివాడు దొరకడం సాధ్యం కాదనుకుంటాను,'' అన్నాడు.

ఆ సమయంలో ఆయన కూతురు పుష్ప అక్కడే వున్నది. ఆమె అతి గారాబంగా పెరిగింది. వంట చేతనైనా, ఆమెకు వంట గది అంటేనే చీదర. పరమ బద్ధకపు మనిషి. తండ్రి అన్నదానికి తల్లి సమాధానం



యిచ్చేలోపలే పుష్ప అందుకుని, ''ఈయనతో పాటు ఆ ఇంట్లో మరెందరుంటారు?'' అని అడిగింది.

''అతడికి మరీ అంత దగ్గర బంధువులంటూ ఎవరూ లేరు. ఒంటరిగా వుంటాడు,'' అన్నాడు రామభద్రయ్య.

''ఒంటరిగా వుంటాడా? మరి వంట మాటో!'' అన్నది పుష్ప.

''అతనే వండుకుంటాడు. అచ్చు మీ అమ్మ వండినట్టు వండగలడు,'' అన్నాడు రామభద్రయ్య చిన్నగా నవ్వి.

తండ్రి చెపుతున్నదాన్ని బట్టి చైతన్య బుద్ధిమంతుడు, మంచివాడు; తన దృష్టికి చాలా అందంగా కనబడుతున్నాడు! మరేం ప్రశ్నలడక్కుండా పుష్ప, యీ పెళ్ళికి ఒప్పుకున్నది. ఆ రాత్రి భోజనాలయాక రామభద్రయ్య, చైతన్యను మిద్దె మీదికి తీసుకుపోయి, ''నువ్వు, మా ఇంట్లో అందరికీ బాగా నచ్చావు. మా అమ్మాయి పుష్పను, చూశావు గదా, నీ కిచ్చి చేయాలనుకుంటున్నాను,'' అన్నాడు.

చైతన్య ఒక్క క్షణకాలం నివ్వెరపోయాడు. ఇది, తానేమాత్రం ఊహించని సంగతి. అతడికి ఒంటరి జీవితం కొంత విసుగనిపిస్తున్నది. అందంగా, ఆరోగ్యంగా వుండే పుష్పతో పెళ్ళికి అభ్యంతరం చెప్పవలసిన కారణం అతడికేదీ కనిపించలేదు. సరే, అంటూ తలవూపాడు చైతన్య.

ఆ తరవాత నెల తిరక్కుండానే పుష్పతో అతడి వివాహం జరిగిపోయి, ఆమె కాపురానికి వచ్చింది. వచ్చిన మర్నాడే ఆమె బారెడు పొద్దెక్కిగాని నిద్ర లేవలేదు. కచేరీకి వేళ మించిపోతున్నదని, చైతన్య హడావిడిగా వంటపని ముగించి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం అతడు ఇంటికి తిరిగి వచ్చేసరికి పుష్ప గుడికి వెళ్ళింది. ఆలస్యం అవుతుందేమో అని చైతన్య వంట చేసేశాడు.

ఆ రాత్రి పుష్ప భోజనం చేస్తూ, ''మా నాన్న చెబితే నమ్మలేదు. మీది

అచ్చు మా అమ్మ వంటే!'' అన్నది ఉత్సాహంగా.

భార్య అలా ప్రశంసించేసరికి చైతన్య పొంగిపోయాడు. అయితే, మర్నాడు కూడా తెల్లవారాక భార్య ఎంతకూ నిద్ర లేవకపోయేసరికి చైతన్య ఆమెను తట్టి లేపి, ''కచేరీకి వేళ అవుతున్నది, నువు లేచి, త్వరగా వంటపని ముగించు,'' అన్నాడు.

వంటమాట వింటూనే పుష్ప బెంబేలు పడిపోయి, ఏమి చెప్పాలో తోచక, ''ఒంట్లో బాగోలేదండీ!'' అనేసింది.

ఈ విధంగా పుష్ప ఏవో సాకులు చెబుతూ వారం రోజులపాటు చైతన్య చేతనే వంట చేయించడమే కాక, ఇంటి బూజులు దులపడానికూడా, అవి నాకు అందవంటూ అతడిచేతే ఆ పని కూడా చేయించింది.

భర్తతో యిలాంటి దోబూచులాటతో విసిగిపోయిన పుష్ప, ఆ మర్నాడు అమ్మా, నాన్నలను చూడాలని వున్నదంటూ పుట్టింటికి ప్రయాణం కట్టింది.

ఆ తర్వాత ఆమె పదిహేను రోజులకు తిరిగివస్తూనే, ''ఇవ్వాళ నా కొక చీర కొనండి!'' అన్నది.

''ఇప్పుడు చీర దేనికి? ఒక పండగా లేదు పబ్బంలేదు,'' అన్నాడు చైతన్య.

''పండగలతో ఏం పని? ఎంతో కాలంగా నెలకొక చీర కొనుక్కోవడం, నాకు పుట్టింటి అలవాటు,'' అన్నది పుష్ప.





ఆ సాయంత్రం భార్యను బజారుకు తీసుకువెళ్ళి చీర కొనిపెట్టాడు చైతన్య. తిరిగి వచ్చేప్పుడు బాడుగబండి ఎక్కుతూండగా పుష్ప చెయ్యి బెణికింది. ఆ రోజు కూడా ఎప్పటిలా వంట పని చైతన్యకు తప్పకపోగా, చెయ్యి నొప్పి పెడుతున్నదంటూ మరి కొంతకాలం పుష్ప వంట గది కేసి వెళ్ళడమే మాను కున్నది.

అయితే, యిలా దినదిన గండంగా వంటపని తప్పించుకోవడం చిరాకనిపించి, ఒకనాడామె చైతన్యను, ''మన పెళ్ళికి ముందు, మీకు ఎవరు వంట చేసిపెట్టే వారు?'' అని అడిగింది.

''నేనే చేసుకునేవాణ్ణి,'' అన్నాడు చైతన్య.

ఆ జవాబుకు సంతోషించిన పుష్ప, ''అలా చెప్పండి! మరి ఇప్పుడు నన్ను వంట చెయ్యమని అడుగుతారెందుకు? ప్రతిదీ గుప్పెడు వేసేచోట రెండు గుప్పెళ్ళు వేస్తేసరి; మనిద్దరికీ వంట సిద్ధమైపోతుంది,'' అన్నది.

ఆ మాటలతో చైతన్యకు, భార్య మన స్తత్వం పూర్తిగా అర్థమైపోయింది.

మర్నాటి ఉదయం అతడు కచేరీకి వెళుతూండగా పుష్ప, ''చీర కొని చాలా కాలమయింది. సాయంకాలం వచ్చేప్పుడు ఒక మంచి చీరగా చూసి కొనుక్కురండి,'' అన్నది.

చైతన్య జవాబివ్వకుండా మౌనంగా వెళ్ళిపోయాడు. సాయంత్రం కచేరీ నుంచి వచ్చేటప్పుడు, తను వాడుకగా కొనే బట్టల దుకాణానికి పోయాడు. అక్కడ దొంతర్లుగా పేర్చివున్న చీరల్లోంచి, ఒక ఎర్రరంగు చీర తీసియివ్వమని దుకాణం వాణ్ణి అడిగాడు.

''క్రితంసారి మీరూ, అమ్మగారూ వచ్చినప్పుడు అలాంటి చీరే కొనుక్కు పోయారు. ఇప్పుడు మీకు నచ్చిన మరొక రంగుది తీసుకు పొండి,'' అన్నాడు దుకాణంవాడు.

కాదు, అదే కావాలని ఎర్రరంగు చీర తీసుకుని, డబ్బు చెల్లించి ఇంటికి వచ్చే శాడు చైతన్య. ఆ చీర చూస్తూనే పుష్ప ముఖం చిట్లించి, ''పోయినసారి తీసుకున్న రంగుదే మరొక చీర తెచ్చారు. ఇది, దుకాణంలో యిచ్చేసి, మరొకటి తీసుకురండి,'' అన్నది.

''మళ్ళీ ఎక్కడ వెళ్ళేది! నీ దగ్గిర వున్న అన్నిచీరల్లో, ఒకేరంగువి రెండుంటే మునిగిపోయిందేమిటి?'' అన్నాడు చైతన్య.

''ఏదో చాలా తెలివిగా మాట్లాడాననుకోకండి. పాతిక చీరలున్నా, ఎవరూ ఒకే రకం కట్టుకునేందుకు యిష్టపడరు. రంగులోనే, నాణ్యతలోనే, ఎక్కడో మార్పంటూ వుండాలి,'' అన్నది పుష్ప.

''చీరల్లోనే ఒకేరకంవి రెండు వుంటే సహించలేని నీవు, నా జీవితం మాత్రం పెళ్ళికి ముందూ, తరవాత కూడా ఒకే రకంగా వుండాలని ఎందుకు కోరుకుంటున్నావు? మీ నాన్న ఆరోగ్యం బావుండడం లేదని, యిన్నాళ్ళూ నీ అగడాలు సహించి వూరుకున్నాను,'' అంటూ చీర తీసుకుని బజారుకు వెళ్ళిపోయాడు చైతన్య.

భర్త మాటల్లో వున్న సత్యం గ్రహించిన పుష్పకు, యిన్నాళ్ళుగా అతడి మనసుకు బాధకలిగించినందుకు కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. తన తల్లి వంటను తండ్రి మెచ్చుకుంటున్నప్పుడు, తల్లి మొహంలో కనిపించే ఆనందం, తృప్తి ఆమెకు గుర్తుకు వచ్చింది.

రెండు గంటల తరవాత చైతన్య మరొక రంగు చీరతో ఇంటికి వచ్చేలోపల పుష్ప వంట పూర్తిచేసి, అతడు వాకిట్లోకి రాగానే, ''నేను మూర్ఖురాలిని, క్షమించండి!'' అన్నది.

''మూర్ఖులకు తమ తప్పు తెలియదు. తప్పు తెలుసుకున్న నువ్వు మూర్ఖురాలివి కానేకావు,'' అని నవ్వుతూ, చైతన్య తాను దుకాణం నుంచి తెచ్చిన నీలం రంగు చీరను భార్య చేతికి యిచ్చాడు.



# కోపం మార్చిన రూపం

ఒక చిత్రకారుడు జమీందారును చూడబోయాడు. ఆ సమయంలో ఆయన చాలా కోపంగా వున్నాడు. చిత్రకారుడు చెప్పే ఒక్క మాట కూడా వినకుండా, ఆయన అతణ్ణి నానా మాటలూ అని పంపేశాడు.

కొంతకాలం ఆగి, జమీందారు సభ తీరివున్నప్పుడు చిత్రకారుడు ఆయనను మళ్ళీ కలుసుకుని, ఒక చిత్రపటాన్ని ఆయనకు అందించి, "తమరి బొమ్మ గీశాను, మంచి బహుమతి యిప్పించాలి!" అన్నాడు.

జమీందారు కోపంగా ఆ బొమ్మను సభికులవైపు విసిరికొట్టి, "ఇదా, నా బొమ్మ!" అంటూ గట్టిగా కేకలుపెట్టాడు.

"చిత్తం! తొలిసారి దర్శనం చేసుకున్నప్పుడు కూడా, తమరిలా కోపంగానే వున్నారండి," అన్నాడు చిత్రకారుడు.

ఆ సమయంలో జమీందారు పక్కన స్తంభానికి అమర్చబడిన అద్దంలో తన ప్రతిబింబం చూసుకుని ఉలిక్కిపడ్డాడు. అది చిత్రకారుడు గీసిన తన బొమ్మలాగే వున్నది!

సభికులు జమీందారు చిత్రపటాన్ని చూసి ఆశ్చర్యపడ్డారు. అప్పుడు సభలో ఎలా వున్నాడో, బొమ్మలో కూడా అలాగే వున్నాడు. కోపం తన రూపాన్నెలా మారుస్తుందో తెలియచేసిన చిత్రకారుడిని జమీందారు ఘనంగా సన్మానించాడు.

తర్వాత ఆయనెన్నడూ ఎవరిమీదా కోపగించుకో లేదు. —"బాబి"





# విష్ణుకథ

సూతుడు నారదుడి గురించి చెప్ప సాగాడు:

ముందు జన్మలో నారదుడు ఒక దాసికి కొడుకై జన్మించాడు. ఆ దాసి ఒక భాగవతోత్తముడి ఇంట పని చేస్తుండేది.

ఆ ఇంట సదా మునులు, జ్ఞానులు అతిథిసత్కారాలను పొందుతూండేవారు. పసివాడైన నారదుడు వారికి అవసరమైనప్పుడల్లా నీళ్ళు అందిస్తూ, సపర్యలు చేస్తూ, వారు మాట్లాడుకొనే గొప్ప గొప్ప విషయాలను, విష్ణుమహిమలను శ్రద్ధగా ఆలకిస్తూండేవాడు. నీరు యిచ్చేవాడని వారు పసివాడిని నారదుడు అని పేరు పెట్టి, "నారదా!" అని పిలుస్తూండేవారు.

అంతలో అతని తల్లి పాము కాటుతో మరణించింది.

పసివాడికి తండ్రి ఎవరో, ఏమైనాడో తెలియదు.

తోటిపిల్లలు నారదుణ్ణి దాసి దాని కొడుకనీ, దిక్కుమాలినవాడనీ అంటూండేవారు.

కొద్ది రోజులకే ఇంటి యజమాని భాగవతోత్తముడు కూడా గతించాడు.

నారదుడు నిరాశ్రయుడై తిరుగుతూ, ఆకలితో ఏ ఇంటి ముందైనా నిలబడితే అతణ్ణి దొంగను చూసినట్టు చూసి తరిమేవారు.

తండ్రి ఎవరో తెలీని పాపిష్టివాడని తిట్టేవారు.



నారదుడు పరమసాధువు అవడం చూసి దుడుకుపిల్లలు రాళ్ళు రువ్వీ, కొట్టీ, ఏడిపించి ఆనందిస్తూండేవారు.

"నేను ఈ మనుషుల్లో ఎందుకు పుట్టాను? నేనేం తప్పు చేశానని నన్నింత అన్యాయంగా చూస్తున్నారు? క్రిమి కీట కాలు, అడవుల్లో మృగాలు హాయిగా బతుకుతున్నాయి!" అని అనుకుంటూ నారదుడు ఊరు విడిచి అడవిపట్టాడు.

అతనికి మునులు, జ్ఞానులు చెప్పుకొనే విషయాలు గుర్తుకొచ్చాయి. "నేనెందుకు తపస్సు చెయ్యకూడదు! గొప్ప పుట్టుక దేవతల్లో పుట్టాలి!" అని అనుకుంటూ తపస్సు మొదలు పెట్టాడు నారదుడు.

"దిక్కులేనివాడికి ఎవడు దిక్కో, యీ లోకానికంతకూ - ఎవడు తండ్రో అతడే నాకు అన్నీ! నన్ను అతడేంచేసినా సరే, అంతా అతని ఇష్టం!" అంటూ కాలం గుర్తు లేకుండా ఘోరమైన తపస్సు చేశాడు. నారదుడి తపస్సు పరిపక్వ మైంది. అతనిపై గొప్ప తేజస్సు పడి అతణ్ణి ఆవరించింది.

జ్యోతి రూపంలో ప్రసన్నుడైన విష్ణువు, "వత్సా నారదా! నీవు నాలో కలిసిపోతు న్నావు, నీవు బ్రహ్మ మానసపుత్రుడవై జన్మిస్తావు. నీలో నా అంశ వుంటుంది. చిరంజీవిగా త్రికాలవేదివై ముల్లోకాలు తిరుగుతూ సదా నన్ను కీర్తిస్తుంటావు!" అని చెప్పాడు.

నారదుడు విష్ణు అంశతో బ్రహ్మకు కుమారుడై, దేవమునిగా పూజింపబడ్డాడు. విష్ణువు యొక్క లీలావతారాల్లో నారదుని అవతారం ఒకటిగా చెప్పబడింది.

అటువంటి నారదుడి వల్ల ఉపదేశం పొంది ధ్రువుడు చరచరా వెళ్తూంటే, "అన్నా, ఆగు! అడవికి వెళ్ళొద్దు!" అంటూ పరుగు పరుగున ఉత్తముడు ఏడుస్తూ వచ్చి ధ్రువుడికి అడ్డంగా చేతులు సాచి నిల్చుని, "నువ్వు, అడవికి పోతే నే నెవరితో కలిసి హరిభజన చేసేది? ఆడించడానికి నీలాంటి అన్నయ్య ఎక్కడ

దొరుకుతాడు? మా అమ్మ, నిన్ను అన్ని మాటలన్నదని, నా మీద నీకెందుకు కోపం? వెళ్ళకు, రా!'' అంటూ వలవలా ఏడ్చాడు.

ధ్రువుడు ఉత్తముణ్ణి కౌగలించుకొని, ''తమ్ముడూ! నన్ను కన్నందుకు మా అమ్మ కూడా గొప్పది అనిపించుకోవద్దా? అందుకే వెళ్తున్నాను!'' అన్నాడు.

ఉత్తముడు, ''అయితే, నేనూ నీతో అడవికి వస్తాను, నువ్వు తపస్సులో ఉంటే నేను పళ్ళు అవీ తెస్తుంటాను!'' అన్నాడు.

ధ్రువుడు, ''అలా అయితే, మీ అమ్మ ఏడుస్తుంది, తమ్ముడూ! నేను అన్నను, నా మాట వినాలి, వెళ్ళు!'' అన్నాడు అప్యాయంగా.

ఆ మాటతో ఉత్తముడు అలాగే చతికిలబడి ఏడుస్తూంటే సురుచి వచ్చి బుజ్జగించబోతే, ''అమ్మా! నన్ను ముట్టుకోకు. నీ మూలాన్నే అన్నయ్య వెళ్ళిపోతున్నాడు!'' అన్నాడు.

సురుచి లజ్జతో తలవంచుకొని, ''నేను పాపిష్ఠిదాన్ని, అంతా నా మూలానే జరిగింది!'' అని అంటూంటే ఉత్తానపాదుడు, ''ధ్రువా! ధ్రువా! అగు, నాయనా! ఇదంతా నా మందబుద్ధి వల్లనే జరిగింది. నా సింహాసనం నీది! రా నాయనా!'' అంటూ ఎలుగెత్తి పిలుస్తూ అక్కడికి వచ్చాడు.



అప్పటికే ధ్రువుడు చాలాదూరం వెళ్ళిపోయాడు.

నారదుడు సునీతితో, ''అమ్మా! నీవు రత్నగర్భవు! నీ కుమారుడి గురించి విచారించకు, నారాయణుడే అతనికి రక్ష!'' అని చెప్పి ఉత్తానపాదుడితో, ''రాజా! ఇది మనం అందరమూ సంతోషించవలసిన సమయం. నీకు తండ్రీ, ధ్రువునికి తాత అయిన స్వాయంభువ మనువు వంశానికి ధ్రువుడు ఎనలేని కీర్తి తెస్తాడు. ఇందులో ఎవరు చేసిందీ ఏమీ లేదు, అంతా ఆ నారాయణుని



సంకల్పమే!'' అని చెప్పి అందరిని ఊరడించి శాంతపర్చాడు.

ధ్రువుడు మధువనంలో ఓం నమో నారాయణ అని తపస్సు చేస్తూంటే యమునానది జల జల పారుతూ శృతి కలుపుతూన్నది. క్రూరమృగాలు అతని చుట్టూ ఆప్తమిత్రుల్లా తిరుగుతున్నాయి. అతని తపస్సుకి ముల్లోకాలు గజ గజ లాడాయి.

ఎవరెక్కడ తపస్సు చేస్తున్నా ఇంద్ర పదవి కోరతారనుకుని భయపడే ఇంద్రుడు ధ్రువుడి తపోభంగానికి భీతికలిగించే ఇంద్రజాలం చాలా చేశాడు. వజ్రాయుధం ఝళిపించి ఉరుములు, మెరుపులు, పిడుగులు రాల్చి బీభత్సం చేశాడు. ధ్రువుడు దేనికీ చలించలేదు. ఇంద్రుడు రాళ్ళ వర్షం కురిపించాడు, విష్ణుచక్రం ధ్రువుడిపై తిరుగుతూ అన్నిటినీ తూలగొట్టింది.

అప్పుడు నారదుడు ఇంద్రుడుతో, ''ధ్రువుడు సామాన్య బాలుడని అనుకున్నావు. అతణ్ణి నువ్వేమీ చేయలేవు. అనవసరంగా బెంగపడకు. ఇంద్రపదవి అతనికి గడ్డిపరక లాంటిది. తెలుసా!'' అని బుద్ధిచెప్పాడు.

ధ్రువుని తపస్సుకి మెచ్చుకొని విష్ణువు ప్రత్యక్ష మయ్యాడు. ధ్రువుడు విష్ణువు కాళ్ళుచుట్టేసి విష్ణువు ముఖాన్ని తదేకంగా చూస్తూ పట్టరాని ఆనందం వల్ల నోట మాట రాకుండా వుండిపోయాడు. ''నిన్ను నోరారా స్తుతించాలని వుంది. నేను బాలుడను. స్తోత్రపాఠాలు తెలియవు.'' అని మనస్సులో అనుకుంటూ ఆనంద బాష్పాలు రాలుస్తున్నాడు.

విష్ణువు తన శంఖాన్ని ధ్రువుడి చెక్కిళ్ళకు తాకించాడు. వెనువెంటనే వేద వేదాంతాల సారంనిండిన గొప్ప స్తోత్రాన్ని ఏకధారగా సామగానం చేశాడు ధ్రువుడు.

విష్ణువు మందహాసం చేస్తూ, ''ధ్రువా, ఏం కావాలో చెప్పు!'' అన్నాడు.

ధ్రువుడు ''ఓ పరమపురుషా! తుమ్మెద పద్మాన్ని అంటిపెట్టుకొని వుండేలాగా సదా

నీ మధుర మందహాసవదన పద్మాన్ని చూస్తూ వుండాలనే తప్ప నాకు, మరే కోరికా లేదు!'' అన్నాడు.

"అలాగే వుందువుగానిలే! నీరాజ్యానికి వెళ్ళి రాజ్యంచేసి ధర్మపాలన నిర్వర్తించు. పిమ్మట నువ్వు నా రూపమైన విశ్వానికి శిరోభాగంగా వుండే ధ్రువపదాన్ని చేరు తావు. కల్పాంతరాలు గతిస్తూన్నా చెక్కు చెదరని అచలపదాన్ని అలంకరించి వెలుగుతూంటావు!'' అని చెప్పి అంతర్థాన మయ్యాడు విష్ణువు.

ధ్రువుణ్ణి అనుగ్రహించిన విష్ణు అవత రణం ధ్రువనారాయణావతారం అని చెప్పబడింది.

ధ్రువుడుమాహిష్మతీపురానికివచ్చాడు. ఉత్తానపాదుడు అతనికి రాజ్యాన్ని అప్ప గించి తపస్సుకి వెళ్ళిపోయాడు. ధ్రువుడు చక్కగా రాజ్యపాలన చేస్తూన్నాడు.

ఉత్తముడు ఇంకా వివాహితుడు కాలేదు, రాజధర్మం అనుసరించి ప్రజ లకు వన్యమృగబాధ లేకుండా చేయడానికి వేటకు వెళ్ళాడు. హిమాలయ పర్వత అరణ్యంలో దుస్వభావులైన యక్షులు విరుచుకుపడి అతణ్ణి చంపారు.

సురుచి పుత్రశోకంతో అక్కడకు వెళ్లి అరణ్యంలో రగుల్కొన్న కార్చిచ్చులో కాలిపోయింది.



ధ్రువుడు యక్ష నిర్మూలనం చేయ డానికి యక్షనగరమైన అలకానగరాన్ని ముట్టడించాడు. మాయల మారులైన యక్షులు క్షుద్రమైన మాయాజాలాన్ని ప్రయోగించారు. ధ్రువుడు నారాయణా స్త్రంతో మాయల్ని పటాపంచలు చేసి విజృంభించాడు.

కుబేరుడు శరణాగతుడై ధ్రువుణ్ణి మంచి చేసుకుని అనేక సంపదలిచ్చి పంపాడు.

ధ్రువుడు పలువురు కుమాళ్ళను కన్నాడు. ఆదర్శ రాజ్యపాలన చేసి స్వాయంభువ మనువంశానికి కీర్తి తెచ్చాడు. చిరకాలం రాజ్యం చేసి కుమా



రుడికి పట్టం కట్టి ధ్రువుడు బదరికావ నానికి వెళ్ళాడు. విష్ణువును ధ్యానిస్తూ బంగారు శరీరాన్ని పొందాడు.

విష్ణు ఆదేశంతో విష్ణుభటులు విమానం తెచ్చారు. వారు నాలుగు చేతులతో విష్ణువులాగే ఉన్నారు.

ధ్రువుడు వారితో, "మా అమ్మకు లేని ఉన్నతపథం నాకు అవసరంలేదు!" అన్నాడు. విష్ణు దూతలు ముందుగా ఒక దివ్య విమానంలో ధ్రువమండలానికి వెళ్తూన్న సునీతిని చూపించారు. అప్పుడు ధ్రువుడు సంతోషించి విమానం ఎక్కి గ్రహమండలాల్నీ నక్షత్ర మండలాల్నీ సప్తర్షి మండలాన్నీ దాటి ధ్రువపదానికి చేరాడు. ధ్రువపదాన్నే విష్ణుపదము, అనీ ధ్రువక్షితి అనీ అంటారు. విష్ణువు నివాసమైన వైకుంఠము అక్కడే ఉంటుంది. ధ్రువక్షితిలోనే గోలోకము ఉంటుంది. గోలోకములో విష్ణువు రెండు చేతులతో కృష్ణుడుగా ప్రకృతి స్వరూపిణియైన రాధాదేవితో కలిసి వేణువును ఊదుతూ ఆనందిస్తూ ఉంటాడు. గోలోకానికి పైన గొప్ప అంధకారం వ్యాపించి ఉంటుంది. ఆ అంధకారానికి అవతల విష్ణువు వైకుంఠ వాసుడై వెలుగుతూ ఉంటాడు. ధ్రువుడు సదా విష్ణువును చూస్తూ ఉజ్వల కాంతితో ప్రకాశించాడు. గుంజకు కట్టిన ఆవులాగ సప్తర్షి మండలం అతని చుట్టూరా ప్రదక్షిణం చేస్తూంటే, సమస్త నక్షత్ర గ్రహ గణాలతో నిండిన శింశుమార చక్రం అతని క్రిందుగా తిరుగుతూంటుంది.

గోలోకానికి దిగువ బ్రహ్మ ఉండే సత్యలోకము, జనలోకము, మహర్లోకము, స్వర్లోకము, భువర్లోకము, భూలోకము అనే ఊర్ధ్వలోకాలు ఏడూ, భూలోకానికి దిగువ అధోలోకాలనబడే అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళ లోకాలు ఏడూ కలిసి పధ్నాలుగు లోకాలకు మీదుగా విశ్వశిఖరాగ్రంపై ధ్రువుడు దిక్కులకు దిక్కుగా అచలపద నక్షత్రంగా ప్రకాశిస్తున్నాడు.

దీక్ష ఉండాలేగాని, చిన్న పెద్ద అనే తారతమ్యాలు లేకుండా ఎంతటిదైనా సాధించలేనిదంటూ ఉండదు. అందుకు ఐదేండ్ల ప్రాయంలోనే తపస్సుకి వెళ్ళిన బాలధ్రువుడే తార్కాణం! అని సూతుడు ధ్రువచరిత్ర ముగించి తిరిగి చెప్పడం ప్రారంభించాడు:

మత్స్యం కేవలం జలచరమైతే తాబేలు నీటిలోనూ, భూమిపైనా చరిస్తుంది.

నీటిలో నుండి ప్రాణి నేల మీదకు వచ్చింది; అంటే జలచరదశనుంచి భూచరదశకు పరిణామం జరిగిందన్న మాట.

అలాంటి తాబేలుగా విష్ణువు అవతరించాడు. అదే దశావతారాల్లో రెండవదైన కూర్మావతారం! అంటూ సూతుడు మునులకు కూర్మావతారగాథ చెప్పడం ప్రారంభించాడు :

దేవతలు, రాక్షసులు కలిసి క్షీరసాగరాన్ని మధించి, అమృతాన్ని సాధించటానికి తయారయ్యారు.

అమృతం సిద్ధించనీ, అది అంతా మనదే అవుతుంది! అని భుజబలంలోనూ, సంఖ్యలోనూ అధికులైన రాక్షసులు ఎత్తుగడ వేసుకున్నారు.

రాక్షసులకూ అమృతంతో అమరత్వం సిద్ధిస్తే, మనకు ఒరిగేది ఏముంది ? అంతా ఆ విష్ణువుదే భారం! అని దేవతలు విష్ణువును నమ్ముకున్నారు.

పాలసముద్రంలో మందరపర్వతాన్ని కవ్వంగా నిలబెట్టి, వాసుకి మహాసర్పాన్ని తాడుగా చుట్టి, చిలకటానికి నిర్ణయం జరిగింది. కాని, మందరపర్వతాన్ని తెచ్చి పాలసముద్రంలో వేయడం ఎవరికీ శక్యం కాని పని! విష్ణువు అనుగ్రహించి, ఆ పని నెరవేర్చి, గిరిధారి అనిపించుకున్నాడు.

రాక్షసులు వాసుకి తలవైపు పట్టుకుంటామని పట్టుబట్టారు. అలాగే ఒప్పుకోండని దేవతలకు చెప్పి విష్ణువు తాను కూడా దేవతలందరి. చిట్టచివర వాసుకి తోక పట్టుకున్నాడు. క్షీరసాగర మథనం ప్రారంభమైంది.





# తీరిన సందేహాలు

వింధ్యపర్వత ప్రాంతంలో శంభుడని ఒక పేద యువకుడుండేవాడు. వాడు కొండ చరియలో కష్టపడి వ్యవసాయం చేసి ఏదో విధంగా తన ముసలి తల్లిని పోషిస్తూ వచ్చాడు. ఒకనాడు వాడికొక సందేహం కలిగింది: తన యీడువాళ్ళు తనలాగే కష్టపడి ధనవంతులవుతున్నారు గదా, తాను ఏడాది పొడుగునా కష్టపడినా తన పొట్టా, తన తల్లి పొట్టా ఎందుకు నిండదు?

ఆ ప్రాంతాల ఉండేవాళ్ళు, "అనుమానం ఉంటే అంగీరస మహామునిని అడుగు," అనడం ఆచారంగా వుండేది. ఈ అంగీరస మహాముని నాసిక వద్ద కొండలలో తపస్సు చేస్తూ ఉంటాడని చెప్పుకునేవారు.

శంభుడు తన అనుమానం గురించి అంగీరస మహామునిని అడగాలని నిశ్చయించాడు. ఈ ఆలోచన తట్టగానే వాడు తల్లితో, "అమ్మా, నేను నాసికకు బయలుదేరి పోతున్నాను!" అని చెప్పాడు. తల్లి వద్దని ఎంత బతిమాలినా వినిపించుకోక వాడు నాసికకు బయలుదేరాడు.

పోగా పోగా ఒక నిర్జన ప్రాంతంలో వాడికొక గుడిసె కనిపించింది. ఆకలిబాధ జాస్తిగా ఉండటం చేత శంభుడా గుడిసెలోకి వెళ్ళి, అందులో ఉండే అవ్వను, "అవ్వా, నాకింత అన్నం పెడతావా? దూరం నుంచి వస్తున్నాను!" అని అడిగాడు.

అవ్వ వాడికి అన్నం పెట్టి, "అయితే, నాయనా, నువు ఎక్కడికి పోతున్నావు? ఏం పని మీద పోతున్నావు?" అని అడిగింది.

"నేను ఎంత కష్టపడినా నా దారిద్ర్యం ఎందుకు తీరదో అంగీరస మహామునిని అడగబోతున్నాను," అన్నాడు శంభుడు.

25 ఏళ్ళనాటి చందమామ కథ



ఆ ఇంటాయన శంభుడికి తనతోబాటు అన్నం పెట్టించి, "అయితే, నాయనా! నువు ఎక్కడికి పోతున్నావు? ఏం పని మీద పోతున్నావు?" అని అడిగాడు.

"నేను ఎంత కష్టపడినా నా దారిద్ర్యం ఎందుకు తీరదో, నాసిక వద్ద వున్న అంగీరస మహామునిని అడిగి తెలుసుకో బోతున్నాను," అన్నాడు శంభుడు.

"అలాగా? అయితే కాస్త నా విషయం కూడా అడుగుదూ! మా దొడ్లో చక్కగా నవనవలాడే నారింజ చెట్టుంది. ఎన్నాళ్ళు చూసినా ఒక్క పిందె కూడా పడకుండా ఉంది. అంగీరస మహామునిని అడిగి కారణం తెలుసుకు వస్తావా?" అని అడిగాడు గృహస్థు.

సరేనని శంభుడు పోగాపోగా ఒక కీకారణ్యం మధ్య వాడికొక ఆశ్రమం తగిలింది.

ఆ ఆశ్రమంలో ఉండే ముని దగ్గరికి వెళ్ళి శంభుడు, "స్వామీ, ఆకలిగా ఉన్నది, అన్నం పెడతారా?" అని అడిగాడు.

ముని వాడికి భోజనం పెట్టి, "నువు ఎక్కడికి పోతున్నావు? ఏం పని మీద పోతున్నావు?" అని అడిగాడు.

"నేను ఎంత కష్టపడినా నా దారిద్ర్యం ఎందుకు తీరదో అంగీరస మహామునిని

"అయితే ఆయనను ఇంకొక విషయం కూడా అడుగు, బాబూ. నా మనమరాలు పద్దెనిమిదేళ్ళది. చక్కనిచుక్క. కాని అది ఎన్నడూ మాట్లాడి ఎరగదు. దానికీ మూగతనం ఎలా పోతుందో కాస్త అడిగి వస్తావా?" అన్నది అవ్వ.

శంభుడు సరేనని అక్కడి నుంచి బయలుదేరి మళ్ళీ నడక సాగించాడు. పోగా పోగా ఒక ఊరి వెలుపల వాడికొక ఇల్లు కనిపించింది. వాడా ఇంటి దగ్గిర ఆగి ఇంటి యజమానిని, "అయ్యా, దూరం నుంచి వస్తున్నాను. ఆకలిగా ఉంది, కాస్త అన్నం పెట్టిస్తారా?" అని అడిగాడు.

అడిగి తెలుసుకోబోతున్నాను,'' అన్నాడు శంభుడు.

''అయితే ఆయనను నా అనుమానం కూడా ఒకటి అడుగుతావా ఏమిటి? ఎంతో కాలంగా నేను కొన్ని సిద్ధులకోసమై తపస్సు చేస్తున్నాను. కాని నా తపస్సు ఎంత కాలానికీ సిద్ధించకుండా ఉంది. కారణం తెలుసుకువస్తావా?'' అన్నాడు ముని.

శంభుడు సరేనని బయలుదేరి చాలా రోజులు ప్రయాణం చేసి అంగీరస మహాముని ఉండేచోటు చేరుకున్నాడు.

ఆ మహాముని శంభుణ్ణి ఎంతో ఆదరంతో తన ఆశ్రమంలోకి తీసుకుపోయి, వచ్చిన పని అడిగాడు.

''మహాత్మా, నేను నాలుగు సందేహాలు తమరిని అడిగిపోదామని వచ్చాను,'' అన్నాడు శంభుడు.

''నాకు మూడు సందేహాలకన్న ఎక్కువ తీర్చే నియమం లేదు, నాయనా. నీ సందేహాలలో ఒకటి వదిలేసి మిగిలినవి అడుగు, వాటికి తగిన సమాధానాలు చెబుతాను,'' అన్నాడు అంగీరసమహాముని.

శంభుడు కాస్సేపు ఆలోచించి, అన్ని సందేహాలలోకి తన సందేహమే చచ్చు సందేహమనే నిశ్చయానికి వచ్చాడు.

తరవాత వాడు మూగపిల్లను గురించీ, గృహస్థు దొడ్లో వున్న కాపులేని నారింజ చెట్టును గురించీ, సిద్ధించని ముని తపస్సును గురించీ, మహామునిని అడిగి





ఆయన ద్వారా సమాధానాలు తెలుసుకున్నాడు.

తరవాత వాడు ఇంటికి ప్రయాణమై మొదట ముని ఆశ్రమానికి వచ్చాడు. ముని ఆత్రంగా, ''అంగీరసు డేమన్నాడు, నాయనా ?'' అని అడిగాడు.

''మీ తలలో ఏదో మణి ఉన్నదట. మీ తపశ్శక్తి యావత్తూ దానికే పోతున్నదట. దాన్ని పెరికివేస్తే మీ తపస్సు తప్పక సిద్ధిస్తుందని అంగీరస మహాముని చెప్పాడు,'' అన్నాడు శంభుడు.

ముని ఆశ్చర్యంతో తన జడల మధ్య తడివి చూసుకుంటే చేతికి మణి తగిలింది. దాన్ని పెరికి ఆ మహాముని శంభుడి కిస్తూ, ''దీన్ని నువే ఉంచుకో, నాయనా! ఇక నేను సిద్ధులు సంపాదించుకుంటాను!'' అన్నాడు సంతోషంగా.

శంభుడు ముని వద్ద సెలవుపుచ్చుకుని గృహస్థు ఉండే చోటికి వచ్చాడు.

''నా అనుమానం సంగతి అంగీరస మహాముని ఏం చెప్పాడు, నాయనా ?'' అని గృహస్థు ఆత్రంగా శంభుణ్ణి అడిగాడు.

''మీ నారింజ చెట్టు కింద తొమ్మిది బిందెల నిండా బంగారం ఉన్నదట. వాటిని పైకి తీస్తే చెట్టు చక్కగా కాస్తుందట!'' అన్నాడు శంభుడు.

ఈ రహస్యం ఇతరులకు తెలియటం అంత మంచిది కాదని, ఆ గృహస్థు ఆ రాత్రి శంభుడి సహాయంతో నారింజ చెట్టు అడుగున తవ్వాడు. నిజంగానే అక్కడ తొమ్మిది బంగారపు బిందెలూ దొరికాయి.

''నాయనా, నాకు చాలా ఉపకారం చేశావు. ఈ బిందెలలో ఒకటి నువు పట్టుకుపో!'' అన్నాడు గృహస్థు.

ముని ఇచ్చిన మణినీ, గృహస్థు ఇచ్చిన బిందెనూ తీసుకుని శంభుడు అవ్వ ఉండే గుడిసె చేరుకున్నాడు.

''నా మనమరాలి విషయం అంగీరస మహామునిని అడిగావా, బాబూ ? ఆయన

ఏమన్నాడు ?'' అని అవ్వ ఆత్రంగా శంభుణ్ణి ప్రశ్నించింది.

''అడిగా నవ్వా! నీ మనమరాలికి నచ్చిన వరుడు కనబడగానే దానంతటఅదే మాట వస్తుందని అంగీరస మహాముని చెప్పాడు!'' అన్నాడు శంభుడు.

సరిగా ఆ క్షణంలోనే అవ్వ మనమరాలు అక్కడికి వచ్చింది.

శంభుణ్ణి చూడగానే ఆ పిల్ల చెక్కిళ్ళు సిగ్గుతో ఎర్రబడ్డాయి. ఆమె అవ్వతో, ''ఈయన ఎవరు అమ్మమ్మా!'' అన్నది.

అవ్వ ఆశ్చర్యంతో నిర్ఘాంతపోయి, ''నిజంగా నీ నోట మాట వచ్చిందా, నా తల్లీ! అయితే ఈ అబ్బాయే నీ మొగుడు! మీ ఇద్దరికీ ఇవాళే పెళ్ళి చేయిస్తాను!'' అన్నది ఆనందంతో.

ఆ ప్రకారమే శంభుడు ఆ పిల్లను పెళ్ళాడి ఆమెనూ, బంగారపు బిందెనూ, మణినీ వెంటబెట్టుకుని ఇంటికి వచ్చాడు.

ఈ లోపుగా శంభుడి తల్లి కొడుకు కోసం ఏడ్చి ఏడ్చి కళ్ళు పోగొట్టుకుని గుడ్డిదై పోయింది. కొడుకు గొంతు విని ఆనందించిందే తప్ప ఆమె వాణ్ణి కళ్ళ చూడలేకపోయింది. తన కోడలినీ కళ్ళ చూడలేకపోయింది.

శంభుడు మణిని తీసి తల్లి కళ్ళకు దగ్గిరిగా పెట్టి, ''ఇదైనా కనిపిస్తున్నదా, అమ్మా ?'' అని అడిగాడు.

తల్లి దాన్ని చేతిలోకి తీసుకుని తన కళ్ళకు ఎంతో దగ్గిరిగా పెట్టుకుని, ''కనిపించటం లేదు, నాయనా!'' అంటూండగానే ఆ మణి ఆమె గుడ్డికళ్ళకు తగిలింది.

ఆ మరుక్షణమే ఆమె కళ్ళు యథాప్రకారం వచ్చేశాయి. ముని చేసిన తపస్సంతా దిగమింగిన ఆ మణి చాలా మహిమ గలదని శంభుడు తెలుసుకున్నాడు. దాని సహాయంతో తనకు ఏ కష్టాలూ రాకుండా చూసుకుంటూ, బంగారంతో తన కోరికలన్నీ తీర్చుకుంటూ అతను తన భార్యతో ఎంతోకాలం సుఖంగా కాపరం చేశాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1983 మే నెల సంచికలో ప్రకటింపబడును.







D. N. Prasad Suryakant Yadav

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ మార్చి నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింప బడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చదివి చెప్పు అర్థం

రెండవ ఫోటో : చల్ల చెయ్యకు వ్యర్థం

పంపినవారు : కె. భానుమతి, జగన్నాధపురం, కాకినాడ-2.

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA



## An Appeal to the Readers

We have always resisted the idea of a price increase for your magazine. We have done so only when circumstances have left no option for us and that too with the greatest hesitation, for it has been a matter of policy with us not to pinch the purses of our young, devoted readers.

A contingency has arisen again now after two years. The rapid increase in the cost of production in the recent months has compelled us to slightly enhance the price of CHANDAMAMA in all languages from the issues dated April 1983. The magazines will be available for Rs.2.00 per copy.

We had to take this step, reluctantly again, as we did not like to reduce the content or make any compromise on its quality. We are sure, you will view the situation with sympathy and understanding.

—Publishers

ప్రవేశ రుసుము లేదు



# చందమామ కేమెల్ రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**

**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పో. బా. నం. 9928 కొలాబా, బొంబాయి-400 005.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి పత్ర వ్యవహారాలు జరుపబడవు.

Name:.................................................................Age:......................

Address:.......................................................................................

...................................................................................................

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: *31-3-1983*

**CONTEST NO 29**

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

VISION Tel

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | ... | 'CHANDAMAMA BUILDINGS'<br>188, Arcot Road<br>Vadapalani, Madras-600 026 |
| 2. *Periodicity of Publication* | ... | MONTHLY |
| | ... | 1st of each calendar month |
| 3. *Printer's Name* | ... | B. V. REDDI |
| *Nationality* | ... | INDIAN |
| *Address* | ... | Prasad Process Private Limited<br>188, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 4. *Publisher's Name* | ... | B. VISWANATHA REDDI |
| *Nationality* | ... | INDIAN |
| *Address* | ... | Chandamama Publications<br>188, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 5. *Editor's Name* | ... | B. NAGI REDDI |
| *Nationality* | ... | INDIAN |
| *Address* | ... | 'Chandamama Buildings'<br>188, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 6. *Name & Address of individuals who own the paper* | ... | CHANDAMAMA CHILDREN'S TRUST FUND<br>Beneficieries: |

1. B. V. NARESH
2. B. V. L. ARATHI
3. B. L. NIRUPAMA
4. B. V. SANJAY
5. B. V. SHARATH
6. B. N. RAJESH
7. B. ARCHANA
8. B. N. V. VISHNU PRASAD
9. B. L. ARADHANA
10. B. NAGI REDDI (JR)

All Minors, by Trustee :
M. UTTAMA REDDI, 14, V. O. C. Street, Madras-600 024

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

B. VISWANATHA REDDI
*Signature of the Publisher*

*1st March 1983*

# READY, STEADY, GO!







*WITH*

# Jalans SCHOOL BAG

★ It is for you, light as you wanted it to be, but roomy enough for all your books, tiffin box, pencil box and even comics.

Created in colours of Cherry Navy blue, Green..........to match your School Uniform and likes. Carry it anywhere you want after school to swim, picnics or even a short holiday.

like it ? Now get your folks to present you one on your birthday.

★INDIA'S First Moulded School Bag made for you by—






**SHREE LAXMI ENTERPRISES**

2, LALBAZAR STREET, CALCUTTA-700 001

ZOREX/10

# పాపిన్స్ తంత్ర

రాము, శ్యాము
చెబుతారొక కథ బలేగా
రారండోయ్ పిల్లల్లారా
వినండి మీరు శ్రద్ధగా






అనగనగా ఒకచోట, అక్కడో పెద్ద సరోవరం
అందమైన ఆ సరోవరం, ఎన్నో చేపల నివాసం.
అందులోనే ఉండేది ఒక తెల్ల హంస
చేపలు పెట్టాయి దానికి 'మామ' వరస.
మామా అల్లుళ్ల మధ్య ప్రేమ అపారం
ఆడుతూ పాడుతూ అవి చేసేవి విహారం.
హంస మామ ఒక రోజు ప్రయాణమైంది షికారుకు
ఆలస్యంగా తిరిగొస్తా అని చెప్పింది చేపలకు.
అదనుకోసం చూస్తున్న ఒక టక్కరి కొంగ
అక్కడికి వొచ్చింది మహా విబ్బరంగా

"ఎవరు నువ్వు?" అడిగాయి చేపలు దూరం నుంచి
"హంసకి తమ్ముడ్ని-మీ మామని" అందా కొంగ ఆలోచించి.
అదే తియ్యని కంఠం, అదే తెల్లని రూపం
మామ తమ్ముడే అనుకున్నాయా చేపలు పాపం.
కొంగ దగ్గరికి వెళ్లాయి ఆనందంగా
చిక్కుకున్నాయి దాని వలలో అమాయకంగా
నోరు తెరిచింది ఆ టక్కరి కొంగ
స్వాహా చేసింది చేపల్ని మిక్కుటంగా

అందుకే ఓ పిల్లల్లారా మీరూ వినండి శ్రద్ధగా
అందరూ ఎప్పుడూ ఉండాలి ఎంతో మెలకువగా
తినకండి సుమా నకిలీ పాపిన్స్ మీరు
కడుపు నొప్పితో ఆనక బాధపడతారు




నకిలీవాటి మోసంలో పడనే వద్దు
అలాంటివెప్పుడూ మనకొద్దే వద్దు
అందమైన వెండి చారలు ఉన్నాయేమో చూడండి.
అసలైన పాపిన్స్ పాకెట్ అదే అని గ్రహించండి